# సతీతులసి

[illegible]ంకముల నాటకము.

గ్రంథకర్తః-

రామ నారాయణకవులు.

ప్రకటనకర్తః-

రంగా వేంకటరత్నము,

బుక్ సెల్లరు,

బెజవాడ.



For Permission to Stage, apply to:-
THE PUBLISHER, Bezavada.
1932.




పాలి వెంకట మునియ్యగారి స్వకీయమగు

ఏలూరు శ్రీ పాండురంగ ముద్రాక్షరశాల యందు ముద్రింపఁబడె.

1932.




# సతీతులసి

[ అను ]

## తులసీమాధవము.



గ్రంథకర్త:

**రామనారాయణకవులు**

ప్రకటనకర్త:

**రంగా వెంకటరత్నం**

బుక్కు సెల్లర్సు బెజవాడ.

7 వ కూర్పు 1000 ప్రతులు

పాలి వెంకట మునియ్యగారి స్వకీయమగు

శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడియె.

1932



( వెల రు 1—2—0

# ఈ నాటకమున వచ్చు పాత్రములు.



పురుషులు;

బ్రహ్మ— సృష్టికర్త
విష్ణుమూర్తి— వైకుంఠనాథుడు
పరమేశ్వరుడు— కైలాసపతి
ఇంద్రుడు— అమరవిభుడు
జలంధరుడు— పరమేశ్వరుని కోపజ్వాలవలన జనించినవాడు, బృందకు,పతి
మణికుండలుడు— బృందతండ్రి
నారదుడు— దేవముని
గాలవుడు— ముని

స్త్రీలు.

సతీదేవి— పరమేశ్వరునిభార్య
లక్ష్మి— విష్ణుమూర్తి భార్య
బృంద— జలంధరుని భార్య
చారుమతి— గాలవుని భార్య





# స తీ తు ల సి.

## నాం ది.

శా॥ బృందం గోరి విచారమందఁ దగునే ♦ విష్ణుండవై యుండి; యీ
ఛందంబున్ వినినన్ జనుల్ నగరె చా ♦ ల్జాలింకయంచున్ మహా
నందం బొప్పగఁ బల్కఁ గౌఁగిటఁ రమా ♦ నారిన్ గృపం జేర్చు, గో
విందుం డేలును గాత సత్కృపమెయిన్ ♦ వీక్షించుచున్ సభ్యులన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(ప్రవేశించి) పూజ్యులగు నో సభాస్తారులారా!

శా. శ్రీకల్యాణగుణాకరుం డమరసం ♦ సేవ్యుండు, నిత్యుండు, లీ
లాకారుం డఖిలాంతరంగుఁ డమలుం ♦ డాద్యుం డనంతుండు, సు
శ్లోకుం డాశ్రితభక్తరక్షణుఁడు, త్రై ♦ లోక్యప్రభుండైన, ల
క్ష్మీకాంతుండు నిరంతరంబును శుభ ♦ శ్రీలిచ్చి మిమ్మోముతన్.

(సభ్యులపైఁ బుష్పములఁజల్లి తనలో) ఆహా! సకలకళావిశార
దులగు నీసభ్యులచే నేఁడొకనూతన నాటకము ప్రదర్శింపఁ జేయుట
కాజ్ఞాపింపఁబడితిని. ఇయ్యది నాకు సంతోషమేగాని యీనాటకప్రద
ర్శనమున వీరిచిత్తము రంజిల్లఁజేయుదునా యని సంశయము గలుగు
చున్నది. కానిమ్ము. (ప్రక్కకుంజూచి) మారిషా!

మారిషుఁడు—(ప్రవేశించి) బావా! ఏమి సెలవు?

సూత్రి—ఇంకను నేమి సెలవయని యడుగుచుంటివా! కార్యభారమెంత
యో తలపై నుండ నీవిట్లు సోమరివై యుండిన నేనేమందును!

మారి—బావా! నేను చేయవలసిన కార్యమేమి?

సూత్ర—మారిషా! లతాంతనితాంత సౌరభాక్రాంత దిగంతమును, నిరంతర దక్షిణవాత పూర్ణరోఘోంతమును, కోకిల భృంగశుకారవ చాలితదాంత సంతతిస్వాంతము నగువసంతము ప్రవేశించినది చూడుము.

చ. పసమశమస్సమూహము పరి • భాతపువేళను నొయ్యనర్ణ జంగ
గరహి సురేడ్గిశాతటాల • గాలిలవినోదయుకాంతిపంక్తినై
ఖాంబాశీర్ష జీర్ణదళ • కాండములైన మహీజశాఖికో
త్కరములఁ బల్లవాంకురాని • ఛాయను రంజిలె మంజులాకృతిన్.

మారి... ఈవసంత కాలమెంత యో సౌఖ్యదాయకమైనదికదా!

సూత్ర—ఈవసంతర్తువున, నీసభ్యులకు నొక నూతననాటకప్రదర్శనమున సంతసము గూర్పఁదలఁచితిని.

మారి—నాటకమేదో నిశ్చయించుకొంటివా?

సూత్రి—అందులకే నిన్నుఁబిలిచితిని.

మారి—బావా! ఇంత పెద్ద నిడికొని యూరంతయు వెదకినట్లున్నది. నీవు నాందియందు చక్కనికథనే సూచించితివి కదా!

సూత్ర—మారిషా! ఆకథను జక్కగ జ్ఞప్తికిఁ దెచ్చితివి. ఆకథ! సతీతులసి' యనుపేర నాటకముగ నిటీవలనే యొకకవి రచించినాడు అయ్యది యింతవఱకెవ్వరును బ్రదర్శించకపోవుటంజేసి, ప్రథమ ప్రదర్శనా గౌరవము మనము దక్కించుకొందము.

మారి—ఆర్యా! గ్రంథకర్తరచనా విశేషమునుబట్టి నాటకప్రదర్శకులను. ప్రదర్శకుల నైపుణినిఁబట్టి గ్రంథకర్తను బేర్కొనవచ్చును అందుచే నీనాటకము రచించినవారెవరో తెలిపినగాని నేనేమియుఁ జెప్పఁజాలను.

సూత్రి—నీవా విషయమున సందియమొందఁ బనిలేదు.

చ తిరుపతి వేంకటేశ్వర సు • ధీశులఁగొల్చి నిరర్గళామృతా
కరరసపుంజ మంజులవి • కస్వరచారు కథాసుధాధురం

ధరబహుళప్రబంధకవి ♦ తారచనాచతురోక్తి సంపదల
వరలు ప్రసిద్ధుఁడైన కవి ♦ వక్కఁడొకండు రచించె దీనినిన్.

మారి—పేరు రహస్యమైనదా యేమి ?

సూత్రి—అతఁడు మనకుఁ జిరపరచితుండే

సీ. మొగమైన జూపకే ♦ భూరివేంకటగిరి,
క్ష్మాపాలు సత్కృతిఁ ♦ గాంచినాడు
తిరువాంకూరు నృపతికి ♦ దివ్యకవితఁ జూపి,
బంగారు బిరుదంబు ♦ బడసినాడు
అంకనీడ్యాపతి ♦ యాదరింపఁగ నెంత
యైన విమలయశం ♦ బందినాడు
సత్యవోల్వంశాబ్ధి ♦ చంద్రులౌ తగిన స,
త్కవియంచు మన్నింప ♦ దనరినాఁడు
తే. గీ. కోటగిరివంశ వారాశి ♦ కువలయాప్తు
చేత బంగారు బిరుదంబు ♦ జెందినాడు
వినగలేద ద్రోణమరాజ ♦ విమలవంశ
వార్ధి శశిని శీతారామ ♦ వరసుకవిని

మారి—అవునవును జ్ఞప్తికి వచ్చినది. అనేక దృశ్యకావ్యము లితఁడు కర్తయగుటయేగాక, ఈతని విరచితములగు కొన్నివచన గ్రంథములు పాఠశాలలయందుంచుటకుగూడ దొరతనమువారిచే నామోదింపఁబడినవి.

సూత్రి—నీకుఁ దెలియని దేమున్నది ? (సభికులంజూచి) పూజ్యులగు నోసభాస్తారులారా ! గ్రంథకర్త తమతో నిట్లు విన్నవింపుమని నాకాజ్ఞాపించినాడు.

సీ. సాంధ్రి భాషాపికే ♦ సరహస్య నిక్షేప
కుక్షియై యలరెడు ♦ కోమలాంగి
వేశ్యఁజూపఁబడ కొ ♦ ప్పిన యగ్రంధతిరీతి
వర్తించు చుండిన ♦ వారిజాక్షి

క్షితినాథ చంద్రుల • స్తుతిఁగాంచి యశముతో,
వర్ధిల్లు చుండిన • పద్మగంధి
గర్వ మింతయు లేక • కవుల కెల్ల విధేయు,
తనుజూపి చెలఁగెడి • తలిరుఁబోడి
తే. గీ. మూషక కవిత్వ కన్యక • మాహిరిమీాకు
నూతనము గాదు; కావునఁ • భీతి విడిచి
యీా "సతీతులసి" ని మీాకు • నిడితి దీని
నాదరింపుఁడు ప్రీతిమై • నార్యులార.
(ఇంచుక యూరకుండి) నావిన్నపము గూడ నొక్కింతవినుఁడు.
సీ. సాధ్వియౌబృందపై • సాహసంబున జలం,
ధరుడు జూపెడి నిరా • దరణపథము
గర్వించి యతఁడన్య • కాంతల బల్మిమై,
గూడగా నెంచిన • క్రౌంటతనము
ఎంతచేసిన, గాని • యింతివానిని నతి,
శాంతితో గొల్చెడి • సరళతయును
లోకరక్షకుఁడయ్యు • లోలాక్షి బృందను,
విష్ణుండు మోహించి • వెలయునీతి
తే. గీ. పతి గతింపఁగా నా బృంద • ప్రాణములను
బాసి, తులసిమైన విధంబు • బరగ మీార
లిందు వీక్షించి యానంద • మందగలరు
ధన్య గుణులార మో సభా • స్తారులార.
(మారిషునిఁజూచి) మారిషా! ఇంక మనమాలస్యము జేయక పాత్రలను సిద్ధము జేయుదము రమ్ము.
(నిష్క్రమింతురు.)
ఇది ప్రస్తావన.



# సతి తులసి.

## ప్రథమాంకము.

[రంగము:—(1) పర్వతగుహాద్వారమున ప్రవేశము :—పరమేశ్వరుఁడు]

పర—(తనలో) మూడుమూర్తులకును మూలకారణమైన యీ యాది శక్తి యెప్పటికితపము చాలించునో! ఆమె తన తపమున కెవ్వరైన భంగము గలిగించెదరేమో యని నన్నియ్యెడ నతిజాగరూకతతో నుండుమని చెప్పెను. ఇంతవరకును నామె లేవలేదు. మింటఁ బ్రభాకరుఁడు తన ప్రచండకిరణములతోఁ బ్రకాశించుచున్నాఁడు. అబ్బా! వేడి యధికముగనున్నది. (అటునిటుఁజూచి)

చ॥ మిహిరుని వేడికిన్ మిగుల ♦ మింటఁ జరింప నశక్యమై తనూ
రహములు పీచనోడి కడు ♦ రోజుచు బల్వడఁ గొందుచున్ మహా
ర్యుషకారుదితార్ధతో గగన ♦ మున్ వెన నంటిన వానిఁ బిల్చుచున్
విహగకులంబులెల్లఁ దరు ♦ వీధుల మీదికిఁ జేరె నొయ్యనన్.

(ఇంద్రుఁడు—ప్రవేశించును)

ఇంద్రు—(తనలో సృష్టిస్థితిలయంబులకు గారణంబైన యాదిశక్తిని నొకసారి దర్శించి కృతార్థుఁడ నగుదుగాక. (ఎదుటఁజూచి) కైలాసపతి యగు పరమేశ్వరుఁడు గూడ నిచ్చటనే యున్నవాఁడు. ఈతని దర్శనముగూడ నా కిచ్చట లభించుట నా భాగ్యవిశేషమే.

(పరమేశ్వరుని సమీపించి)

సీ. పరమపావనియంచు ♦ బిరుదంబు గాంచిన
గంగాఝురము మస్త ♦ కమున నమర

పలిక భాగమునందు ♦ నలఘు కుంకుమబొట్టు
గతినున్న మూడవ ♦ కన్ను మెఱయ
వజ్రపంజరసిభ ♦ వక్షస్థలంబున
రమణీయ సర్ప హా ♦ రంబు లలర
పగడంపు కాంతికి ♦ వంకఁ బెట్టఁగఁజాలు
నరుణజటానము ♦ త్క్వరము దనర
తే. గీ. శాణిపోషిత హారిణ శా ♦ బకము కెలఁగఁ
గన్నులకు బందువగుచుమం ♦ గళములకును
నాస్పదంబైన నీమూర్తి ♦ నార్తి దీరఁ
గాంచినాడను ధన్యతఁ ♦ గాంచినాడ.

(పరమేశ్వరుని సమీపించి) రజతాద్రినిలయా! శంకరా! వంద
నములు.

పర—ఓహో! ఇంద్రుడా యేమి!

తే. గీ. సుఖమె నీభార్యపౌలోమి ♦ శుభమె మీజ
యంతపుత్రుండు భద్రమే ♦ యమరతతికి
నీకు నిరతంబు మోదమే ♦ నాకలోక
సార్వభౌమ! వచింపుమా ♦ సంతసింతు.

ఇంద్రు—దేవా! మీకరుణచే మేము సుఖముగనే యుంటిమి.

పర—మహేంద్రా!

తే. గీ. అదె నభోమండలంబున ♦ నయ్యినుండు
చండకిరణుఁడై యుండె నీ ♦ సమయమందు
నెడఁకుబోవుచు నిట్యేడ ♦ కేగుదెంచి
వావు, వినదలంతును గార ♦ ణము బలారి

ఇంద్రుడు—మహేశ్వరా! నాకితరకార్య మేమియును లేదు నేనిక్క
డ కేయరుదెంచితిని.

పర—కారణము.

ఇంద్రు—ఆదిశక్తిని దర్శించుటకు
పర—అహ్హాహ్హా నవ్వుచున్నాఁడు)
ఇంద్రు—శంకరా! అట్లు నవ్వితివేమి!
పర—మరేమియును లేదు. ఆజగజ్జనని యోగసమాధియందున్నది.

ఇంద్రు—తపమునుండి యెప్పటికి లేచునో తెలియదు. అయినను నామె యిప్పుడెవ్వరికిని దర్శనమీయదు కావున నీవాయాశ యిప్పటికి విడిచి మఱియొక సమయమునరమ్ము.

ఇంద్రు—పరమేశ్వరా! నీవట్లు జెప్పిన నేమందును? దయయుంచి నాకాశ నమ్మహాదేవి కెఱిగింపుము.
పర—ఆమె నీవిప్పుడెంత శ్రమపడినను దర్శనమొసంగదు.
ఇంద్రు—ఏమి! ఆమెనాకు దర్శనమొసంగదా!

చ. అమర విభుండనై విబుధు • లంజలిఁ గొల్చుచునుండ నాకలో
కము రహినేలు నన్నిపుడు • గాంచకయుండునె యాదిశక్తి తా
నమిత కృపారసంబున న • యారె! యిటుల్ వచియింప నీకు న్యా
యమె కృపఁదాల్చి చెప్పుము ను • దాగమనంబును నామెకీశ్వరా.

పర—నీభాగ్యమునుబట్టి యామె నీకు దర్శనమొసంగునని తలంచు చుంటివా యేమి! గర్వాంధకారమున మునిగియున్న నిన్ను జూడనే చూడదు.

మ. అలఘుప్రజ్ఞను యోగమార్గముల న • భ్యర్థించు యోగీశ్వరా
వళికైనన్ నిరతంబదృశ్యయగుచున్ • భాసిల్లునద్దేవిఁగ
న్నులఁ వీక్షింపఁగఁజాల వీవిపుడు ని • న్నున్ లక్ష్మి గర్వాబ్ధిలో
పలఁగ్రుంగం బొనరించియుండుటను దే • వాధీశ వేయేటికిన్.

సంపదంధులను నామె వీక్షించదు.

ఇంద్రు—ఉమాకళత్రా! నీవాక్యములు చిత్రముగ నున్నవి. నీవు కేవల మనూనుపకుండవై యిట్లు వదించుచుంటివిగాని మఱి యొండుకాదు. సమస్తసౌఖ్యములకు మూలము సంపదయేకదా! సంపదలేనివాని బ్రదుకు నిరర్థకము.

వర—ఆసంపదయే మానవుని క్రుంగఁజేయునది నీ వమరలోకవిభుండ వనుమాటయేగాని నీబ్రదుకునకుఁ బ్రతిదినమును గండమే.

తే. గీ. ఎప్పుడే క్రూరదానవుం • డెత్తివచ్చి
రణముఖంబున గెల్చి సా • మ్రాజ్యలక్ష్మి
నపహరించునో యనుచు నీ • వాత్మయందు
జింతతోడనుండెదవు శ • చీకళత్ర.

నాకట్టిచింత యేమియు లేదుకదా

ఇంద్రు—నిజమే.

సీ. వసియింప సౌధంబు • వరలకుండుటచేత
వెలయుచుందువు నీవు • వెండికొండ
కడుపు కూటికిలేని • కతమునఁ దిందువు హా
హ్లాదమెసంగ హా • లాహలంబు
ధరియింప హారముల్ • దొరకకుండుటచేత
గళమునఁ దాల్తువు • గ్రఫణినమితి
దారిద్ర్యబాధచే • ధనమున కాసించి
చేరినాఁడవల కు • బేరుమైత్రి

తే. గీ. యిట్టివాఁడవు నీవు న • న్నేలపరిహ
సింపవలదు నీస్థితినాకుఁ • జిత్తమునకు
దుఃఖమైనను లేక సం • తోషమైన
ధనములేనట్టి బ్రదుకు వ్య • ర్థంబుగాదె.

సీ. భిక్షపాత్రియు • వెలయకుండుటచేత
బట్టినాఁడవుచేత • బ్రహ్మశిరము.

గవ్వకొంటకు శాటి • గానక దాల్చినా
వింపని భావించి • యేన్గతోలు
విహరింప వని లేక • విహరించు చుందువు
బహుభయంకరమైన • వల్లకాట
వాహనంబులు లేక • బహుమోదమని యెంచి
యెక్కు చుంటివి గాదె • వృషభమూర్తి
తే.గీ. యిట్టి దేకద నీస్థితి • యెవ్వ రెరుగ
రేల నాపయి నసూయను • హించి పలికె
దిట్లు పరశక్తి దర్శింప • నెంచునాకు
కొద్దిగొప్పలతో నేమి • కుధరవాస

పర—ఓహో! మహేంద్రా! నాస్థితిని నీవు వెక్కిరించు చుంటివిగా! నీకెంత భాగ్యమున్నను నాకు దుల్యుడవు కావు వెఱ్ఱివాడవై నీవు నన్ను బరిహాసించు చుంటివి. నీవాదిశక్తిని దర్శింప వచ్చితివి. ఇది సమయము గాదని చెప్పితిని. దానికీ యుచవనర పరిసంగతుల తొందరపడిన దో గ్రామమగునా!

తే. గీ. ఎద్ది యెప్పుడు గాదగు • నద్ది యప్పు
డగును నీవెంత చేసిన • నగునె చెపుమ
కొట్టి లేపిన యాకోడి • కూసిన ,త
నర్థనిశి(ద్రొద్దువోడు చునే • యమరనాథ,

ఇంక శ్రమజెందక యిప్పటికి మరలిపోయి మఱియొక సమ యమున రమ్ము.

ఇంద్రు—ఇట్లు జెప్పుటకు నీచిత్త మెట్లు సమ్మతించినది. ఆపరంజ్యోతి నీయట్టి వారిని ద్వార రక్షణో ద్యోగమున నియమించుటం జేసి యిట్టిది సంభవించుచున్నది.
తే. గీ. లొల్పుడవు నీక నధికార • మబ్బ కతన
నిట్లు సాహసంబునాం జేయ • నెంచినావు

కీనునకు బెత్తనంబీయ • వెట్టియగుచు
శిరము నంతయు గొరికిన • కిరణి నభవ.

పర—మహేంద్రా! మితిమీరి మదీయ మహిమంబు తెలంగక సంభాషింపకుము. వినాశకాలమునకు విపరీతపు బుద్ధులు పుట్టునన్నట్లు నీకు చేటుకాల మాసన్నమగుటచే నన్ను దూషించుచుంటివి. ఒకతుకదలంచిన వాడవేని వచ్చిన మార్గమున బట్టి పొమ్ము. ఆదిశక్తి నిరసించుటకిది సమయము కాదు.

ఇంద్రు—పోనిమ్ము భగవతి సందర్శనము జేయదలంచిన నాకు నీయాజ్ఞతో నేమిపనియున్నది. నేనిలోనికేగి యద్దేవి తపమునుండి లేచువరకును వేచియుండెదగాక (లోపలికిపోబోవును)

పర—(వారించి) ఔరా! నీగర్వము

శా. ఏమేమీ కనుగాన కీకగణి; నీ • వేయాదిశక్తింగనం
గా మోహంబున బోవుచూచెదవె మ • మ్మార్గజాడతొక్కింత, నా
సామర్థ్యంబు దలంపవేటికి, వినా • శంబుగా మదింగోరి యా
భిమోహ త్ప్రతియాగ్ని మీద శలభం • బీదూకనుంకించునే.

ఇందుకుం దగిన ఫలమనుభవించెదవుగాక! ఇదిగో! మదీయ నిర్నిరోధ క్రోధారుణ వీక్షణంబులనక్షీణహుతాశనకణ స్ఫులింగ నికరంబుల బఱపి నిన్ను దగ్ధము జేసెదంగాక! (కోపముతో) జూచినంతనే యచ్చట యగ్నిజ్వాలలు వెడలును)

ఇంద్రు—(వడకుచు) హా! పరమేశ్వర! అపరాధిని రక్షింపుము రక్షింపుము (పరమేశ్వరునిపాదములపై బడి)

మ. సరసీజాత భవాది లేఖవరు ల • శ్రాంతంబు సేవింప బె
ల్లిరవై మించు మహానుభావుడవు ని • విభ్రంగి నాయందు దు
ర్భరగోపంబును బూని చూచిన నిక • ప్రాణంబులుగా నిల్చునే
పరిరక్షింపుము నీకు మ్రొక్కెదను దే • వా! శైలజావల్లభా!

శా. శ్రీవిష్ణుస్తుతపాద పద్మోదవృన్నై ♦ చెల్వొందుచుం భక్తులం
గావం గంకణమున్ ధరించి- సతితోఁ ♦ గైలాసమందుండు, నా
దేవేశుం నిట నే నెఱింగియు మదాం ♦ ధీభూతచిత్తుండనై
యేవో మాటల నాడినాడ నిఁక దం ♦ డ్రీ! నన్ను రక్షింపవే!

వ:—(చేతులతో నిందుని లేవనెత్తుచు) మహేంద్రా! భయమువిడిచి
లెమ్ము నీకభయమిచ్చితిని.

ఇంద్రు—(కరములుమోడ్చి)

మ. అపరాధంబని యైన యెంచక మదీ ♦ యంబైన దుర్బుద్ధిచే
విపరీతంబుగ నిన్నుఁబల్కితి భవ ♦ ద్విఖ్యాతకారుణ్య దృ
ష్టిపథంబందున నన్ను నిల్పుచును ర ♦ క్షింపందగుం వేగ, నే
నపవిత్రుండఁ బవిత్రుఁజేయుము మహా ♦ త్మా! భక్తరక్షామణీ.

దేవా! భవదీయ దివ్యమహిమ నెఱింగియుండియు, మూఢుం
డనై యజ్ఞానంబునఁబడి నీయెడల నపరాధంబు గావించితిని. భవ
దీయ వీక్షణంబులనుండి వెలువడిన యగ్నిజ్వాల లింకను బ్రజ్వ
రిల్లుచునే యున్నవి. నా భయమువాపి రక్షింపుము.

పర—తే. గీ. చింతపడబోకు దీనికి ♦ స్వాంతమందు
జ్ఞానులకె యిట్టి దొక్క తప్పు ♦ సంభవించు
నీవు ధన్యుడవైతివి ♦ నేను వాదు
కరుణఁగాంచి నాడవు గాన ♦ సురకులేంద్ర

(అగ్నిజ్వాలలకైచూచి) నానేత్రమునుండి వెలువడిన యీ
యగ్నిజ్వాలలు నిరర్థకమై పోరాదు. కావున నేను వీనిని సముద్ర
మునఁ బడునట్లు జేసెద. ఈజ్వాల యొకని జన్మమునకుఁగారణ
మగుఁగాక.

(అగ్నిజ్వాలలను జేతితోఁబట్టి విసరివేసి)

మహేంద్రా! ఇంక నీవరుగుము.

ఇంద్రు—(నమస్కరించి) దేవా! సెలవుగైకొనెద. (నిష్క్రమించును
పర—ఆదిశక్తి తపమునుండి లేచినదేమో చూచెదగాక.

(నిష్క్రమించును.)

రంగము:—(2) సముద్రముపై నొక శిశువు తేలియాడుచుండును.)

(నారదుఁడు - ప్రవేశించును.)

సాగ—(శిశువుంజూచి) ఔరా! ఈ బాలుఁడెవ్వరోకదా! వీఁడో దేవాంశసంభూతుఁడై యుండును. కానిచో జలంబున మునుఁగక తేలుట యెట్లు సంభవించును. సాధారణముగ భూమిపై బ్రాకిన విధముననే నీటను జలముపైఁ బ్రాకుచున్నాఁడు. ఇంచుక యూరకుండి) నేనీ శిశువు తీసెదగాక. (శిశువునుదీసి యెత్తుకొని.)

మ॥ పరమాశ్చర్యము వీని నెమ్మొగ మహో ♦ పర్వేందు బింబునే
పరిహాసంబొనరించుఁ దేజముగనన్ ♦ బద్మాప్తునిన్ మించు న
వ్వరసూనుండో గదా తలంపఁగను నీ ♦ భంగిన్ ననుం జేరె; స
త్కరుణన్ వీనిని నెత్తి పెంచెదను వే ♦ డ్కన్ దేవతల్ మెచ్చఁగన్

ఈ బాలుఁ డొక యపూర్వతేజశ్శాలి. భవదంశ సంభూతుఁడు గాని సామాన్యుఁగాఁడు.

(బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరుఁడు, ఇంద్రుఁడు, ప్రవేశింతురు.)

పర—(ఇంద్రునిఁజూచి) ఇంద్రా! కంటివా! ఆజ్వాల బాలుఁడుగా బరిణమించి, సాగరుని హస్తమున నలంకరింపఁ బడినాఁడు.

బ్రహ్మ—అభవా! ఆబాలుని యపూర్వ తేజమిక్కడనే ప్రకాశించుచున్నది.

విష్ణు—మన మాసాగరుని సమీపించి బాలునిఁజూతము.

(అందఱును సాగరమును సమీపింతురు)

సాగ—(తనలో) త్రిమూర్తులు నన్నుఁ గృతార్థునిఁ జేయుటకుఁ గాబో లిట్లు వచ్చుచున్నారు (బ్రహ్మాదుల కెదురేగి ముందు విష్ణుమూర్తి నింగాంచి)

సీ. నీలనీరదగాత్ర ♦ నిర్జరవన చైత్ర,
శంకరస్తుతిపాత్ర ♦ సచ్చరిత్ర
వైజయంతీ దామ ♦ వర్ణితసుత్రామ,
కల్యాణనామ లో ♦ కాభిరామ
భక్తసంరక్ష ♦ పాపర జలజాక్ష,
శ్రీయుతవక్ష ♦ క్షిత విపక్ష
సర్వలోకాధార ♦ సంశ్రితమందార
నిగమాంత సంచార ♦ నిర్వికార

తే. గీ. నన్ను ధన్యుసింజేయ ♦ నంబు నందు
నంది వీరితో గూడ నే ♦ తెంచినావు
పావనంబయ్యె నాజన్మ ♦ పరమపురుష
యోగిహృద్ధ్యేయ ♦ జగదైక ♦ భాగధేయ.

(పరమేశ్వరునిఁ జేరి.)

మ. కరుణా మూర్తిని భూతనాయకుని న ♦ త్కైలాసవాసున్ సురా
సురసంసేవిత పాదపద్మయుగళున్ ♦ శుద్ధాత్ము శైలాత్మజా
వరునిన్ బాపవిదూరు, భక్తసులభున్ ♦ భావోద్భవారిన్ నినున్
బరమాహ్లాదముతోడఁ జూచితిటనా ♦ భాగ్యంబు సామాన్యమే

(బ్రహ్మనుజూచి) భారతీ రమణా! వేల్పుల పెద్దవగు నీవుగూడ నిచ్చ్యోడ కరుదెంచుటంజేసి నేను గృతార్థుడ నైతిని. (ఇంద్రుని గాంచి) అమరేంద్రా! నీరాక నాకెంతయు మోదావహమయ్యె. (అందఱినిఁ జూచి)

ఉ. ఓ మహనీయులార, సబు ♦ ధోత్తములార! త్వదాత్మలందు, స
త్ప్రేమను బూని నాపయిని ♦ వేడ్కలరారఁగవచ్చినారు నే

నేమి యొనర్పఁగావలెను ♦ నెయ్యది కార్యము యానతిచ్చినన్
మీయుఱదిఁ ముదంబుగను ♦ మేలు ఘటింతును భక్తిమీఱఁగన్.

బ్రహ్మ—(తనలో) మహేశ్వరుని కోపానలజ్వాలయే శిశువై యొప్పెనని యీసాగరునకుఁ దెలియదు. (ప్రకాశముగా) రత్నాకరుండవగు నీకు మాయందంత ప్రేమయుండ, మాకేమి కొఱత! (బాలుని జూచుచు) సాగరా! తన యపూర్వ తేజంబుచే దిశలను వెలిగించుచున్న యీ బాలుఁడెవ్వరో యెఱుంగ వచ్చునా?

సాగ—దేవా! నాకును దెలియదు. ఇట్టి సుందర రూపుని నేను మున్నెచ్చటను జూచి యుండలేదు. ఇంతకుమున్నే నే నీతనిం గాంచి మదీయపూర్వపుణ్యమున నీసూనుఁడు లభించెఁగదాయని పరమామోదము నందుచుంటిని.

విష్ణు—శంకరుని కోపజ్వాలయే యీ బాలునిగా మారెను. ఆహా! ఏమి! ఈకుమారుని సౌందర్యము నయనపర్వముగనున్నది. సాగరా కుమారుని నొకసారి యిటు దెమ్ము. ముద్దాడఁగోర్కెయయ్యె.

సాగ—(విష్ణుమూర్తి చేతికిఁ గుమారు నిచ్చును.)

(విష్ణుమూర్తి కుమారుని నెత్తుకొని నంతనే యా కుమారుఁడు రాక్షసరూపము ధరించి విష్ణుమూర్తి మీఁద కేఁగును.

విష్ణు—ఆ! ఏమి! ఈమాయ నిఖిల దైత్య సంహారుండవగు నాయొద్దనా యీమాయ ఇదిగో! చక్రముచే నిప్పుడే ద్రుంచెదగాక (చక్రము వదలనెంచును.)

బ్రహ్మ—(వారించి) కమలనాభా! నీచిత్తము నాయుద్యమమునుండి మరల్పుము. ఈతఁడు వధార్హుండుగాడు. (రహస్యముగా) రుద్రుని రౌద్రజ్వాలవలన జనించిన యీతనిని నీవు మడియించితివేని యమ్మహాత్ముని మనంబు చిన్నబోవును. (పరమేశ్వరునిఁ జూచి) పరమేశ్వరా! ఈతఁడు భవత్క్రోధానలజ్వాలవలన బ్రాదుర్భవించి

జలముచే ధరింపఁబడెనుగాన యీ జలంధర నామధేయంబున భాసిల్లును (జలంధరుని జూచి జలంధరా! సంగ్రామమున నీవెట్టి వారినయిన జయింపఁగల శక్తిఁబ్రసాదించితిని. మాకరుణచే నీకఖిల భాగ్యంబు లొదవును. విశ్వకర్మ మా యానతిని నీకై యీప్రాంతమున నొక పురము నిర్మించును. నీ వందుండుము.

పర — జలంధరా!

సీ. ధర్మంబెయాత ప ♦ త్రముగాఁగ సఖిల బు
 ధానురాగంబె సిం ♦ హాసనముగ
మునివరా శీస్సులిం ♦ జామరంబుగ న్యాయ
 వృత్తియె కరమున ♦ గత్తిగాఁగ
సఖిలదిక్కుల బ్రాకు ♦ యశమె చేలముగాఁగ
 ధర్మసంధత జయ ♦ ధ్వజముగాఁగ
రారాజుల జోహార్లు ♦ నీ రాజనములుగాఁగ
 తేజమే ఘనమైన ♦ దివ్వెగాఁగ

తే. గీ. లక్ష్మినీయింట నెప్పుడు - లలి వసింప
 నజుడు బ్రోచును నీకు బూ ♦ ర్ణాయువీయ
శ్రీసతీరమణుండు ర ♦ క్షించి మించ
ధరణిఁ బాలింపు మాచంద్ర ♦ తారకముగ.

జలం — దేవా కృతార్థుఁడనైతిని.

పర — (బ్రహ్మనుజూచి) భారతీరమణా! జలంధరునికై పురము నిర్మించుటకు విశ్వకర్మను త్వరగానియమింపవలయును. (తక్కినవారి జూచి) మహేంద్రా! శ్రీహరీ! ఇంక మన నెలవులకు బోవుదము. (సాగరునిజూచి) సాగరా! ఇఁక మేము పోయివచ్చెదము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.





# పత్రిపలసి.

## ద్వితీయాంకము.

(... గా జలంధరుఁడు ముందును, వెనుక నారదుఁడును, ప్రవేశింతురు.)

జల౦—

ఇష్టములేని పెండ్లి యది ♦ యేటికినాకును, నామె కెంత యో కష్టముదోఁచియుండుటను ♦ గాదె తదీయమనంబు నిప్పుడున్ స్పష్టము సేయ నీగతి నా ♦ సర్చెన, దీని కతాన నాకునే నష్టముగల్గునో యికను ♦ నా పురి కేగద సత్వరంబుగన్.

నష్టమైననేమి? నేనామెను స్వీకరింప నప్పుడీ భయమేల? నాదారిని నేను బోయెద. (తొందరగా నడచుచున్నాఁడు.)

నార—ఆ! ఆ! జలంధరా! నిలువుము నిలువుము. (జలంధరునిసమీపించును.)

జలం—మునీంద్రా! నన్నాపవలదు.

నార—సమస్తమును దెలిసిన నీవిట్లు జేసిన నే నేమనఁగలను?

మ. గిరిమందు ... వరప్రపన్న ... గాంచి యున్నంతనే పడియున్ ... భా ♦ వంబందు నిబ్బంగి నీ పలుకన్ బు ని వివా ... ♦ బల్కంగ భావ్యంబె యా పెను కుల్ ... నన్నను నెవ్వ ... నే ♦ బానంచు శ్లాఘింతురే.

తాతకట్టిన మేల్బావి • తప్పదనుచు
నుప్పునీరును దాగిగడి • మెప్పగలఁడె.

నార.— జలంధరా! ఇవి యన్నియు ననవసరమైన గాత్రపరితప్తరము లు. బ్రహ్మమానస పుత్రుఁడనైన నావచనంబులం బ్రసింపుము. అనుమానమే నిన్ను బాధించుచున్నది గాని మఱియొకటికాదు నీకిష్టసిద్ధియకార్య మొనరించితివేని లోకమునందు దలయెత్తి మెలంగఁగాలవు. ఇదియుంగాక విరించి కరుణా సమాసాదితమహా పరాక్రమవంతుండవైన నీకేమిభయము; ఇంక బ్రతివచనము జెప్ప కవచ్చి బృందంగొనుము (ఎదుటజూచి) అదిగో! చూడుము.

సీ॥ వలయితపరివార • జలదాంతరంబునఁ
దీపించుక్రొమ్మించు • దీవయనఁగ
నబ్ధి మథన సము • యంబునఁ బ్రాదుర్భ
వంబునందిన రమా • భాస్కయనగ
నఖిల భూసరహృద్ధి • దారంబు విధిసృజి
యించి పంపించుమో • హినియనంగ
నిజనాథు డాయ హృ • న్నీరజంబున నంచి
కుతుకంబుతో వచ్చు • రతియనంగ

తే. గీ. నలప్వయంవర రంగంబు • నందు విరుల
దండతో నిల్చియున్నది • తన్వి బృంద
కాన నామె మదికి హర్ష • మలరునట్లు
శంక విడనాడి రమ్మింగ • తన్మతలేందగ్రి.

మ. శరదబ్జాత దళాక్షీ భూరివిమల • చ్ఛాయాకలాపంబుచే
నరవింతారి నలంకరించు గతిఁదా • నాత్మీయ హస్తాగ్ర భా
స్వరి పుల్లాబ్జాంతాంత దామకముచే • గైసేసి యాబృంద సు
స్థిరభక్తిన్ నినుబూజసేయఁగను వే • చేరఁ రమ్ము భూపాలకా.

ఇంక మనంబున మఱియొక విధమైన శంకఁ బెట్టుకొనకరమ్ము. (చేయిబట్టుకొని తీసికొనిపోవును)

రంగము:—2. (మందిరమున – మణికుండల యము–బృంద–జలంధ రుడు)

మణి—(జలంధరునిఁజూచి) జలంధరా! స్వయంవరమందిరమున నాకీ తనూజవలన జరిగిన యపరాధముఁ మఱచిపొమ్ము. (ఇంచుక యూరకుండి)

ఉ. మామక భాగధేయమహి • మంబున నీచెలిజన్మమందె, నీ
తామరసాయతేక్షణ క • తంబున తావక శాంభవానుబం
ధామితవైభవంబు వెన • నబ్బెఁ గృతార్థుఁడ నైతినింక నీ,
శ్యామను గాంచునే ... గొను • మయ్య జలంధర భూమినాయకా.

(బృందనుజూచి) అమ్మా! బృందా భవదీయపూర్వపుణ్య విశేషమున నీజలంధరుఁడు నీకుఁబ్రాణేశ్వరుండైనాడు. సకలమెఱిఁగిన నీకు నేనేమియుఁ జెప్పనక్కఱలేదు. అయినను వాత్సల్యమునఁ జేసి చెప్పుచుంటిని.

సీ॥ భయభక్తులనుబూని • పరమానురాగవై
చెలువుని కన్నుల • న్నలమొంగి
చిత్తమందే వేళ • బత్తిపెంపొందఁగా
వృద్ధులకును సేవ • వెలయఁజేసి
యా ప్రబంధుజనాళి • నాదరంబునఁగాంచి
మృదుభాషణముల స • మ్మదమొసంగి
గర్వమింతయులేక • కరుణతో నతిథుల
నష్టమృష్టాన్న సం • తృప్తిఁదేల్చి

తే.గీ. కరుణపీడక సత్యంబు • మఱవకుండ
సుట్టి సాధ్వీలోకంబున • నెందు లేక
టంచు బ్రజలెల్ల నుతియింప • నట్టిభంగి
నుభయకులపవిత్రివగుచు • నొప్పుమమ్మ.

మ॥ అనిశంబున్ రమణప్రియాచరణ కా • ర్యాయత్త చిత్తాబ్జవై
యనువర్తించి జగంబులందున మహా • ఖ్యాతిన్ బ్రవర్తించి వి

యనఘుస్వాంతలు భూరికాంత లనసూ ♦ యాఙంఘతీ కాంతలం
గన! నీవట్లు సుకీర్తి ( జేకొన( దగుం ( గా భర్తృసేవారతిన్.

మ. ఆర్యులటన్న మేల్ వ్రతము ♦ లన్నను దేవతలన్న శాశ్వతైశ్వ
ర్యములన్న నిర్మల య ♦ శంబుఁటన్నను బంధులన్న స
త్కార్యములన్న భాగ్య సుకృ ♦ తంబులటన్న(గుమారినీకు, నీ
యార్యసుతుండె సర్వమని ♦ యాత్మదలంచి చరింపుమమ్మరో

చ. సతివయి జన్మగోత్రము ♦ యశంబలరింపుము మా వధూటివై
స్థితనిజవల్లభాలయము ♦ చెన్నువహింప నొసర్పు మక్కశా
పతివయిపాణనాధువర ♦ భావ కుతూహల మాచరింపు మీ
గతివిలసిల్లినన్ వినుము ♦ ఖ్యాతివహింతువు లో కమందునన్

బృంద— తండ్రి నీయుపదేశ వాక్యములం చ హృదయ ఫలకమున
లిఖించుకొని యుందును.

మణి— (బృంధను జూచి)

సీ. జననమందిన దాది ♦ జననిని నన్నును
విడనాడి యెఱుగని ♦ విదుషీమౌళి
పురమును నేబాసి ♦ యఁగినప్పుడు నాడు
రాకకై వేచును ♦ రాజవదన
యొండకన్ననినేమి ♦ యెన్నడెఱుంగక
సౌఖ్యంబు లందెడి ♦ జలజనయని
కోపంబు నొక్కింత ♦ చూపిన గన్నుల
నశ్రువుల్ నించెడి ♦ యతివమిన్న

తే. గీ. మామకతనూజ యీసతి ♦ మాన్యచరిత
భాగ్యయయ్యెను నీకునే ♦ భంగిదీని
నరసి రక్షించుటు వోృపా ♦ కటఁడవగుచు
భారమంతయు నీయందే ♦ పార్థివేంద్ర!

ఉ. ఆకలి గొన్న దాసదుగ • దన్నము కుత్తుకయంకె యుండినన్
గైకొనబోదు దాహమును • గన్గొని పెద్దలె యివ్వగావలెన్
మాకును జెప్పదేమియును • మాన్యచరిత్రి ! సుశీల నీమనీ
వేకరణిన్ కృపారసము • నింపుచు నింపుగనేలెదో కదా

జలం—(తనలో) నాకీతని పలుకులే వినబడు చుండుటలేదు పుష్ప
హార మీమె కరమునుండి పడినంతనే నాకీయువిద యందున్న
మోహమే పోయినది. ఆనారదుని వాక్యము నతిక్రమింప జాలక
యీమెనుగ్రహించితిని. (ప్రకాశముగా)నృపాలా ఇంక మేము పోయి
వచ్చెదము.

బృంద—తండ్రీనాథుని వెంటనరిగెదను (విచారించును (

మణి—కుమారీ చింతింపకుము లోకైక వీరుండగు జలంధరుడు
నీకు భర్తయయ్యె నాభాగ్యము వర్ణింపదరముగాదు. లప్పుడప్పుడు
నీకుశలవార్తల దెప్పించుకొను చుండుము మేమును వచ్చిచూచు
చుండుత. నీకిచ్చుటకుంకి కావలసిన యుమూల్య వస్తుచయమును
బంపుచుందుము. నీపతియనాజ్ఞ వడసి తీసికొని వచ్చుచుందుము.

జలం—రాజేంద్రా! ఇంకమే మరుగుదము.

మణి—శుభమగుగాక. పోయిరం

అందఱు నిష్క్రమింతురు.)

రంగము:—౩. (వనము — ప్రవేశము — బృంద)

బృంద—(తనలో) ఎంతభాగ్యముండిననేమి ? ఎట్టిసౌఖ్యము లుగలుగు
చుండిన నేమి ? అగ్నిహోత్రుని సాక్షిగం గొన్న సతి పతిచే
నిరాకరింపబడినప్పుడు దీనియున్న యూ నిరర్థకము గదా! అక్కటా
నాభర్త్రృత్యము లకు నేనేమని చింతింతును ? బ్రహ్మాది వరప్రసా
దిత మహారాజ్య బలసంపన్నుడసియు, సుగుణమూర్తి యనియు

దలంచి, మనసారవివాహమాడితినిగాని యిట్లగునని కలనైనఁ దలం
పనైతిని గదా !

తే॥ గీ॥ ఎట్టి సౌందర్యముండిన ♦ నేమి ! యెట్టి
భాగ్యములు గల్గిననునేమి ♦ భర్తచేత
జూడగాఁ బడనట్టి యా ♦ సుదతి బ్రతుకు
కానఁ గాచిన వెన్నెల ♦ కరణిగాదె.

నాథునకు నాయందను రాగము లేక పోయినఁ బోవుగాక! పరసతుల
భంగము సేయు తలంపు మానుమని యెంత చెప్పినను వినఁడయ్యె.
మునియాశ్రమంబులఁ బ్రవేశించి వారాశ్రమమున లేనితఱిని దత్స
త్నుల బలిమిం బట్టదలంచుచుండును. పరనారి కంటఁబడుట భయ
ముగానున్నది! ఈ దుష్ప్రవర్తనమునుండి యీతని చిత్తము ద్రిప్పుట
కెంత ప్రయత్నించినను నాప్రయత్నము కొనసాగక యున్నది.

సీ. తనుఁజేరి నాబుద్ధి ♦ వినఁగుంచుమని వేడ
వినఁడాయె, దాయఁగాఁ ♦ గనుచునన్ను
పరకాంత గవయుట ♦ పాపమంచును నొచ్చ
డాయెగా, నేనెంతో ♦ డాసి పలుక
మానులనేమట ♦ మానుమంచునుకోర
మానడాయెముఁడంబు ♦ బూనుగాని
వరధర్మపథమందు ♦ వర్తింపుమని పల్క
గొనఁడాయె నాపల్కుఁ ♦ గోపమూని

తే॥ గీ॥ ఎంతవేడినఁగాని కా ♦ నంతమైన
మనసు కరగదు నామీద ♦ మన్మనోప
భునకు; నేమిసేయుదు నేరి ♦ బోధ్రివ వేదు
దాన్నఁ బ్రాణేశ్వరుని మంచి ♦ దారిఁబెట్ట.

ఇదియంతయు నేను తొలిజన్మమునఁ జేసిన పాపమీవిధముగఁబరిణ
మించినది ఇంతకును భగవదాజ్ఞకు నన్యథా జరుగ నేరదుకదా !
శక్తివంచనలేకుండ నా జీవితేశ్వరుని సన్మార్గమునఁ బెట్టజూచెదను.

( తెరలో )

దేవీ ! బృందా ! బృందా !

బృంద—(ఎదుట జూచి) అదిగో ! నన్నరయుచు నవమాలిక వచ్చుచున్నది.

నవమాలిక—(ప్రవేశించి) దేవీ ! బృందా ! నీవా జలాకరతీరంబున నుంటి వేమోయని తలంచితిని.

బృంద—లేదు ఇక్కడనే యుంటిని.

నవ—దేవీ! మన మొక్కింత కాల మీవనంబునఁ జరింతమా ! అటు జూడుము. ఉల్లంబుల రంజిల్ల నెల్లెడఁ గొల్లగఁ బూసియున్న మల్లెలును, మిగుల సువాసనచే నెగడుచుఁ జెట్లకెక్కింపఁ బడియున్న పొగడలునుఁ మదనుని కరంబున నుండు శాకులోయనంబడు కేతకీపుష్పములును, మొదలగు సమస్త విరులును సంపూర్ణముగ పూచియున్నవి.

బృంద—(తనలో) నాచిత్తము వనవిహారమునకు సమ్మతించునా ? నిరంతరము నుమనోహరుని గూర్చిన చింతయే గాని మఱియొక విధమగు చింతయేలేదు అయినను నాపరితాప మీనవమాలిక యెఱుగనేల ? ఇట్టిది యొకరు వినవలసినదికాదు. (ప్రకాశముగా) నవమాలికా ! ఆపుష్పసంతతుల కేమిగాని యిటు జూడుము చిలుక ముక్కులచే నొక్కబడి కెంపురుచు లీనుచున్న దాడిమ ఫలంబు లెట్లున్నవో ఆహా ! వనరామణీయకము కన్నులకు బందువై యున్నది.

మ. స్వనితాంతాహతి కోర్వలేకను తరు ♦ చ్ఛాయాపదేశంబుచే
త నరణ్యంబున దాగియుండు ఒహుళ ♦ ధ్వాంతంబునన్ రూపుమా
ప ననేకాకృతులన్ ధరించి యినుఁడీ ♦ వన్యన్ బ్రవేశించెనో
యన శోణద్యుతితో ఫలావళులు నిం ♦ డారెన్ మహీజంబులన్,

ఇదిగో! ఈప్రక్కకువచ్చి, సకలసురమునిరాజ పూజానిధానములును, మిళింద వ్రజనిధానములను, స్వదర్శన పరిభేదిత విరహిలోక పరితాపమానములను నగు సూనంబు లెట్లు మహిత రుచుల నొప్పుచున్నవో చూడుము.

నవ—వానికేమిగాని యిటు చూడుము.

మ. చపలాక్షీ! ఘన సాధ్వివైన నినునో • జన్ జూచి యుక్తాళ్యనీ
కపుగీతంబుల నియ్యశోకలతికా • వారంబు నీకున్ బ్రియా
ళవు మాణిక్యమయంపు బాత్రికలఁగాం • శుల్దీర సూనప్రదీ
పవుబిందూనుచు మంగళారతులిడెఁ • భక్తిప్రపత్తిక్రియన్.

బృంద—సఖీ! ఆకాసారతీరమున నాబకవ్రజమొట్లుండెనో చూడుము.

నవ—దేవీ! వరాంగనల గవయుఁదలంచి చనియెఁ జప్పుడు గాకుండ ఇటునటు తారులాడు విటకాండ్రు చందమున, మీనంబులఁ బట్టుటకై యాబకములు దొంగతపము సేయుచున్నవి.

(విష్ణుమూర్తి ప్రవేశించును.)

విష్ణు—(తనలో) ఈమెచెలికత్తె నన్నుఁ జిలకించెనా యేమి? (పరికించి లేదు. లేదు, (ఇంచుకయూరకుండి) జగద్రక్షణకార్యదీక్షా ధురంధరుడనైన నాకిబృందపై మోహముజనించుటకుఁ గారణము నేనే యూహింపఁజాలక యున్నాను.

తే. గీ. సకలభువనములకొసంగ • జాలునాకు
బృందపై మోహమీరీతి • పొలయుటేడ
జగము దీనిని విన్నచో • నగదె! హరియె
యిట్టి దుష్కార్య మొనరించె • నే యటంచు!

చిత్తమును నీ యుత్కమమునుండి మఱలించుటకెంత ప్రయత్నించినను మాఱకున్నది (ఇంచుకయూరకుండి) బృందమహాసాధ్వి.

నిరంతర పతిసేవాపరాయణ. జలంధరుడు విరించి వరసంజనితబల గర్వోద్రేకుండై చరించుచున్నను, నామెయాతనిని దైవమువలెం బూజించుచున్నది. జలంధరుండెట్టి దుష్కృత్యములసేయుచున్నను నాబృంద మంగళసూత్రి మహిమమున నాతడేవిధమగుహానియుఁ జెందకయున్నాఁడు. నేనీబృందకు నాయభీష్టము దెలిపెదగాక ఆమె యందులకు సమ్మతించదేని నామోహాగ్ని చల్లారుటయేగాక దుర్నీతిపరుండై యున్న జలంధరుండు మడియును దీనంజేసి దేవతలకు హితముజేసినవాడ నగుదును అట్లుగాదేని బృంద సాధ్వీశిరోమణి యను విజయధ్వజము జగంబున నిలిపినవాడ నగుదును. ఏమైనను బృంద సౌందర్యము నా చిత్తమును సంపూర్తిగ నాక ర్షించినది.

తే. గీ. కొమ్మఁగన్నఁ బట్టుకునైన ♦ రిమ్మ తెగులు
గలుగునను మాట నాయందె ♦ తెలిచెనిపుడు
గాకయుండిన నేనేడ ♦ కలికికొలకు
హృదయమున మోహమూని చ ♦ రించుటేడ!

ఆహా! వైకుంఠ పురంబెక్కడ! ఈజలంధరుని పురంబెక్కడ! బృందపైనున్న మోహము నన్నెంత దూరము గొనివచ్చినది.

బృంద—(చెలికత్తెను జూచి) సఖీ! నవమాలికా! వనవిహారముఁ జాలించి గృహమునకుఁ బోవుదమా!

విష్ణు—(తనలో) ఈమె గృహంబున కరుగుచున్నదేమి! ఈమె వెంట జెలికత్తెయుండఁగా నేనెట్లు సంభాషించుటకు సాహసింతును?

నవ—బృందా! గృహమునకు కరుగుటకుఁ దొందరపడనేల; ఆ జాజి పూవులు గోసికొనివత్తము. రమ్ము (బృందతో నిష్క్రమించును)

విష్ణు—(ఎదుట జూచి) ఆహా! ఏమి? ఈమెసౌందర్యము జగన్మోహ మైయున్నది.

మ॥ త్రిజగన్మోహన కాంతిఁగొల్పి, తనువుల్ ♦ దీపింప ధాత్రీభాత నీ
రజ బంధుప్రభఁగూర్చి నెమ్మొగము నా ♦ రాకా నిశానాథు, న
క్షజమై నవ్వగ జేసి, బృంద నిటులో ♦ కంబందు సృష్టించె, నా
యజనిర్మాణపుఁ బ్రౌఢిమెచ్చనగు న ♦ హ్హా మానసం బందునన్.

నిజముగా సృష్టికర్త తన నేర్పంతయు నీమె నిర్మాణమునందుఁ జూపినాడు. అందుచేతనే చతుర్దశ భువనంబులయందు గల సతులకు సౌందర్యమున దలకట్టైయున్నది.

ఉ. ఈరుచిరాంగి విశ్వధర ♦ నిందరి పురంధ్రులకూడమించి వి
స్తారము నందముండునని ♦ ధాత వధూటి లలాటవాటి నిం
పారఁగ వ్రాయనోపు నటు ♦ లౌటనె యీజలజాక్షి కిట్టియా
కారముగల్గెఁ; గానిమెడ ♦ గల్గెనె వేరొకకాంత కెందునన్.

(పరికించి) కాంతామణి సౌందర్యమెంత జూచినను దనివితీరకున్నది.

సీ. పద్మాస్యవేణితో ♦ బ్రతిగాక కాబోలు,
వల్మీక మూలజేరె ♦ ఫణులపంక్తి
తరళాక్షి మోముతో ♦ సరిరాక కాబోలు
బహుళార్తి నుక్కెను ♦ పద్మవైరి
యింతి చందోయితో ♦ నెనగాక కాబోలు
గతులు వాసె నలప ♦ ర్వతపుసమితి
కలికి నెన్నడుముతో ♦ దులగాక కాబోలు
చేరె గుహాలయందు ♦ సింహతతులు
తే.గీ. పొలతి కుఱువులకోడి కా ♦ బోలనంట్లు
తలలు వంచుకొని సిలిచె ♦ దరుణి పాద
మూలకు సదృశంబుగాక కా ♦ బోలు కమల
గణము పంకోదయార్తిని ♦ గాంచియుండె.

ఈ యాకృతింగాంచి యెట్టివారైనను మోహసాగరంబున బడుటనిశ్చయము.

తే. గీ. కామ రహితుఁడయిన మోహుఁ • కామిరైన
నిర్మలాత్మకుండౌ డైనను • నిపుణుఁడైన
సమిత వేదాంత విదుఁడైన • సనఘుఁడైన
నువిదఁగాంచిన మోహంబు • నొందకున్నె.

(పరికించి) అదిగో బృంద చెలికత్తె పూవులంగోసికొని యామెతో నేమిరో చెప్పుచున్నది. ఇఁక నామె గృహంబున కేగునా యేమి!
(మరలఁజూచి) చెలికత్తెతో మరల నేదియో పలుకుచున్నది.

( తెర లో )

నవమాలికా! నీవీపూవుఁగొని గృహంబున కరుగుము. నేను భగవంతుండగు శ్రీమన్నారాయణుని పూజార్థమై ప్రత్యేకముగ గొన్ని పుష్పములు సంగ్రహించుకొని వచ్చెదను.

విష్ణు—(తనలో) అదిగో ఈమె చెలికత్తెను గృహమునకుఁ బంపివేసి మదీయ పూజార్థమై విరులం గోయ నీప్రక్కకు వచ్చుచున్నది. ఈమెంజేరి భాషించుటకిది యెంతేయు మంచి సమయము.

(బృంద—ప్రవేశించును)

బృంద—(తనలో) నవమాలికను గృహంబునకు బంపితిని. విష్ణునకుఁ బ్రీతియగు నాపుష్పములను గోసికొని నేనుగూడ సత్వరంబుగ నరిగెదఁగాక.

(పూవులుగోయుచుండును]

విష్ణు—(తనలో)

మ॥ అకలంకోజ్వల గాత్రిరై తనరు నీ • యంభోజపత్రాక్షి మా
మక సమ్మోహ కలావిశేషమును బెం • పంగానిటంజేరనే
నిఁక నందేహము సంతయుఁ విడిచి యా • హేమాంగినింజేరి మా
మక మోహం బెటిఁగించి సమ్మదమునం • భాసిల్లగాఁ జూచెదఁ
నేనీమె కడఁకఁ బోదఁగాక (బృందయెదుటకు బోవును)

బృంద—(విష్ణుమూర్తిని జూచి తనలో) ఎవ్వరీ పురుషుఁడు! శుద్ధాంత
కాంతనగు నేను విహరించు నీవనంబునఁ బ్రవేశించెను. చెలికత్తెను
గూడ గృహంబునకుఁ బంపితిని. (ఇంచుక యావలకుఁ బోయి)
ఆహా! ఈమహాత్ముని తేజము వనంబంతయుఁ బ్రకాశింపఁజేయు
చున్నది. ఈదివ్యపురుషుండెవ్వఁడోకదా! ఆలోచించిచూడ నీమహాను
భావుఁడు త్రిమూర్తులలో నొకఁడై యుండును. మదీయ పురా
కృతసుకృతంబువలనసి శ్రీహరియె యిట్లు సాక్షాత్కరించి యుండె
నని తలంతు. (ఇంచుక యూరకుండి) నాహృదయమున నదియొక
విధమగు భయమును గూడ జనించుచున్నది. ఏమైనను బరపురుషుఁ
డగు నీతనితో నెట్లు భాషింతును! నేనిఁక సత్వరముగ గృహమున
కరుగుటయే మంచిది. (పోవును)

విష్ణు—(ఎదురై) బృందా ! నిలువుము. నిలువుము.

బృంద—(ఇంచుక భయము నటించి) ఈమహానుభావుఁడెవ్వఁడో నన్ను
నిలువరించినాఁడు. ఇప్పుడు నేనేమి సేయుదును (ఆలోచించి) ఈపుణ్య
మూర్తియెవ్వరో యరసెదఁగాక! ఇంతమాత్రమున నాశీలమున
కేమి భంగ మొదవును! (ప్రకాశముగా)

మ. కమలాకాంతుఁడవో! ప్రభాకరుఁడవో • కామారివో భారతీ
రమణీనాథుఁడవో శచీపతివో తారా • ధరుఁడవో నీదు తే
జము నిండెన్ దిశలెల్లమెవ్వఁడవు, యీచందంబునన్ వచ్చినా
వు మహాత్మా! కరుణన్ వచింపుము నినున్ • బాల్పార బ్రార్థించెదన్

విష్ణు—తరుణీమణీ! ఇప్పుడు నీవు చెప్పినవారిలో నొక్కఁడను.

తే. గీ. భక్తమానస పీఠి ని • వాసభూమి
భక్తరక్షణ కార్యంబు • పరమ హితము
సకల దేవతాతతి నాకు • నాప్తసఖులు
గాఁగ జెలఁగు చుండుదును నేన • కంబుకంఠి.

చ. మనమున నంతతంబును స • మంచిత భక్తిని బూనుచున్ దురం
తనిరతి నన్ భజించెడి బు • ధప్రకరంబున కిష్టవై భవం
బును ఘటియించుచుండు, బరి • పూర్ణకృపారస ధారజిల్కుచున్
వనరుహపత్రనేత్రి నను • భావమునందు గ్రహింప కుంటివే!

బృంద (తనలో) ఈతని పలుకులు మర్మగర్భితములుగనున్నవి. ఈతని జగదానందకరంబగు రూపముజూడగా శ్రీమన్నారాయణుడని తలంచెదను. మరియు సుక్ష్మించి నన్ జేసి, యీపుణ్యమూర్తి నన్ను గృతార్థులుగ జేయు నియ్యెడకు విచ్చేసి యుండును. ఆలోచించు చుందును.

విష్ణు—ఓకుటిలకుంతలా! ఆలోచించుచుంటివేను? ఎవని పూజార్థమై యిప్పుడీ పుష్పముల‌ను నీవు గ్రహించుచుంటివో, యతనిగనన్ను భావింపుము.

బృంద—(సంతోషముతో తనలో) నేడునాపుణ్యము పండినది. ఇమ్మహాత్ముండు సాక్షాదిందిరా నాథుఁడు. (తనలో)

సీ. ఫాలార్థ చంద్రుపైఁ • బ్రాకించు నీలాంబ్రి,
కొటినా నెగడు ము • ంగురులవాని
రమణీయలావణ్య • రసరసి జనించు
తొగలు నాదనకు కం • దోయివాని
కరితుండముల నేలి • పరమభక్తులకు సం
తత మభయమిడు హ • స్తములవాని
వజ్రపంజరనిభం • బైనతతంబును,
సిరికాట పట్టైన • యురమువాని

తే. గీ. అఖిలలోకములకు మూల • మైనవాని
కలితభక్తరక్షణ దీక్ష • గలుగువాని
నిఖిలమునిజన సన్నుతి • నెగడువాని
నాదినారాయణుని గంటి • నార్తిదీర.

(ప్రకాశముగా (గరములు మోడ్చి.)

సీ. కలశవారాశి (యే ♦ లలిత చరితునకుఁ
బావనం బైనని ♦ వాసభూమి
వేయిజిహ్వలుగల్గి ♦ వెలయు శేషాహి యే,
ధీరగుణుండు ని ♦ ద్రించుపాన్పు
విడనాడ కెప్పుడు ♦ వెంటనేయుండెకి,
పక్షీందు్రడెవ్వాని ♦ వాహనంబు
సకలజనతతి కై ♦ శ్వర్యమ్ము నొసగెడి
యిందిరా జల జాక్షి ♦ యెవని దేవి

తే. గీ. వర సురలు మును లెవ్వని ♦ వందిజనులు
భ క్తరక్షణ మెవ్వాని ♦ పరమహితము
నట్టి, లోకైకనాథుని ♦ నమలచరితు
గాంచఁగంటిని కన్నుల ♦ కఱవుదీర

దేవా ! శ్రీమన్నారాయణా ! పరమనిష్ఠా గరిష్ఠులై ఘోరతపం బొనర్చు మునీందు్రల కయినను లభింపని నీదివ్యమంగళ విగ్రహ సందర్శనము నేడునాకు లభించినది. జగద్రక్షణుండవగు నిన్ను బూజించు క్రమముగూడ దెలియసియజ్ఞానురాలను. నన్నెట్లురక్షించెదవో ?

విష్ణు—సతీమణి ! బృందా ! నేను భక్త సులభుఁడను. నీపైననాకున్న యనురాగమే యిట్లు సాక్షాత్కరింప జేసినది.

బృంద—దేవా ! (భక్త్యావేశముతో)

మ. సరసీజాత భవాది శంకరులు స ♦ (త్కాంకంబు సేవింపఁ బె
ల్లిరపై మించు మహానుభావుడవు నీ ♦ విబ్భంగి సన్నుంగనన్
వరకారుణ్యము బూని నీదు నిజరూ ♦ ప స్ఫూర్తితో వచ్చుట
ద్దిర భాగీరథి చొటినేల పయిన ♦ ద్ధిన్ బారినట్లేకదా,

విష్ణు—చకితాక్షీ ! ఇందు నీవునన్ను వినుతింపవలసిన పనియేమియును లేదు. నిరంతరము నీచిత్తము నాపైన ఎలివియున్న దానవగుటంజేసి భక్తిభావంబున నీకు నేను గట్టుబడితిని భక్తులెవ్వరును నన్నింత సులభముగా వశము జేసికొని యుండలేదు.

బృంద—మహాత్మా . నాపై నీకు నిట్టికరుణ జనించినదిగాని, నిరాహారులై వాయుభక్షణ సేయుచు మహారణ్యములందు పరమ నిష్ఠలు బూని ఘోరతపములు జేసిన తాపసోత్తములకంటె నేనెక్కువ దానవా!

విష్ణు—(తనలో) నెమ్మదిగ నాహృదయ మీమెకు దెలియ జేసెద గాక (ప్రకాశముగా) బృందా!— నన్నుఁగట్టి వేసినది నీశక్తి పాశ మొక్కటియే కాదు,

బృంద—కేవలమూఢమతినగు నేనెట్లు శక్తురాలనని చెప్పుదును ఆర్త రక్షణా ? ఇందు నీకరుణా విశేషముతప్ప మరియొకటిలేదు.

విష్ణు—అదియును గాదు

బృంద—దేవా! ఇంక నెనేమని చెప్పగలను?

చ. వనజదళేక్షణా ! విమల ♦ భక్తజనావననీదుదివ్య ద
ర్శనమున మత్కఠోర కలు ♦ షప్రకరంబు డొలంగ జన్మపా
వనత లభించె నిప్పుడు, న ♦ వార్య కృతార్థతగంటి మత్పురా
తనకృత పుణ్యమెట్టిదొ క ♦ దా! నిను జూడగఁగంటి మాధవా!

విష్ణు—శశివదనా! నన్ను ప్రీతించుటంజేసి నీవుకృతార్థురాల వయితివి. నిన్ను ప్రీతించుటచే నేను కృతార్థుడ నగుదును.

బృంద—(తనలో) ఈ దేవాదిదేవుడిట్లు వచించుచుండెనేమి (ప్రకాశముగా) జగత్కల్యాణమూర్తివగు నీవు నన్నిట్లు బలుకనగునే

విష్ణు—

మ॥ అతివా! సందియ మింతలేదు వినుమ • త్యంగద్ది లక్ష్మీసతీ
పతినై యుండి సమస్తలోకములు బెం • పన్ జాలి బృందారకుల్
కుతుకంబూనుచు భక్తిమై గొలువనై • కుంఠంబునందుండు, నే
పతిమోదంబున వచ్చినాడ నిటు నీ • కై యొక్క కార్యార్థమై.

బృంద—మహాత్మా! నీవాక్యము నాకెంతయు వింతగొలుపుచున్నది. దేవాదిదేవుండ వగు నీవు నాకడకుం గార్యార్థివై వచ్చితినని పలికిన నేమనఁగలను?

విష్ణు—నారీమణీ! ఇది నిశ్చయమే! నేనునిన్ను యాచించుటకే వచ్చితిని

బృంద—సమస్తయాచక జనచకోర చంద్రుండవగు నీ వొరులను యాచించువాడవా! ఇట్టివింతగలదా?

సీ॥ రత్నాకరము నీకు • రమణీయవాసంబు
జీవనం బెంతయు • జెలగుచుండె
ఇందిరాదేవి నీ • హృదయ మందుననిల్చి
ధనమునకేమియు • దఱుగు లేదు
భూదేవి రెండవ • పూబోడి యగుచీకు
గోరిన పంటలు • గురియుచుండు
నిఖిల బృందారకుల్ • నీయాజ్ఞ నుందురు
వలసిన దంతయు • భక్తినిచ్చి
తే॥ గీ॥ అట్టినీవేడ! యొరులను • యాచనంబు
సేయుటేడ? నీవాక్యముల్ • చిత్రమయ్యె
నెంమకీరీతి బల్కితో • యింతయైన
కారణ మెఱుంగ కుంటిని • కమలనాథ.

విష్ణు—సుందరవదనా! నేను చెప్పినమాటయందసత్యమించుకయును లేదు. నామనంబున కొకవిషయమై యొకకోరిక యంకురితంబై నేడిటు నీ కడ కరుదెంచితిని. ఆకార్యము నీవలనఁ జక్కబడవలయును.

బృంద—(తనలో) భగవంతుడగు నీ శ్రీమన్నారాయణునివాక్యముల యందర్థము నాకుఁదెలియుట లేదు. ఒకవేళ నన్నుఁ బరీక్షింపఁ దలంచి యేదియేని నెరవేర్చుట కశక్యమైన కోరికఁ గోరదుగదా! (ప్రకాశముగా) దేవా! జగత్కర్తవగు నీకోరిక దీర్చుటకుఁ దగి నంత శక్తురాలనా! నాయందుగరుణ యుండుటంజేసి యిట్లువచిం చెదవుగాని, కాకున్న నేనెంతదానను. అయినను కృపాంతరంగుం డవై భవదభీష్టమెట్టిదో యానతిచ్చితివేని, నీకగుణకుఁ బాత్రినై యశమందు భాగ్యము నాకుంమనేని, చేయఁ జూచెదను.

విష్ణు—బృందా! నాయభీష్టము నీవు దీర్పఁదలంచినచో దీర్పఁగలవు; కాని చెప్పుటకు నాచిత్తమే యొక్కింత వెనుదీయుచున్నది.

బృంద—మహాత్మా! భక్తులయందట్టి సందియము నీకుండఁగూడ దుకదా!

విష్ణు—(తనలో) ఇంకఁ గాలహరణం బొనరింపక నాయభిప్రాయ మెఱిఁగించెదగాక! (ప్రకాశముగా) మోహనాంగీ! నన్నిచ్చోటికు నాకర్షించిగొని తెచ్చినది నీ సౌందర్యమే కారణము.

తే. గీ. జగములందుననున్నట్టి ♦ సతులలోన
అందమున మేటినగుచును ♦ నలగునట్లు
గలిగి నిన్ను సృష్టించెనా ♦ కమలభవుఁడు
భవ్యభవదీయభాగ్యంబు ♦ బలుక వశమె.

బృంద—(తనలో) ఈ జగత్కర్త నాసౌందర్యమును గూర్చి పలుకు చుండెనేమి? (ఆలోచించుచున్నది.)

విష్ణు—

మ. అనుమానింపక తెల్పుచుంటి విను మ ♦ ద్వృత్తాంతబింబాస్య!నీ
ఘన సౌందర్యమె తెచ్చెనిచ్చోటకు, జ ♦ క్కంగట్టి నన్నిప్డు నీ
వనుమానింపకి డెందమందు మదభీ ♦ ష్టావాప్తిఁ జేకూర్చెదో
ఘనసద్భోమంబిది యంచులోఁదలఁతువో ♦ బింబోష్ఠి యేమందువో.

తే. గీ. సకల జగములు రక్షింపఁ • జాలినట్టి
నీవు నీదురూపముఁగాంచి • నెలఁత మోహ
మంది భవదీయ రక్షణం • బందవచ్చు
నాడ, నట్లాదరింతువో • నాతిమిన్న.

బృంద—(తనలో) అక్కటా! సర్వజగన్నియామకుండయిన యీ భగవంతుఁడు నన్ను మోహించునుగదా! ఇట్టి వింత యీతని వినయమున మున్నెన్నడైన వినియుంటినా? శ్రీమన్నారాయణుఁడగు నితఁడెక్కడ? సామాన్యయువిదనగు నేనెక్కడ? నన్ను గామించు టేమి? (ఇంచుకయూరకుండి) భగవంతుఁడగు నితఁడు మదీయ పాతివ్రత్యము పరీక్ష సేయఁదలంచి యిట్లు గోరియుంటినని తలంచెను. నేనీ మహానుభావునకు నేమని ప్రత్యుత్తర మిత్తును (ఆలోచించి) కానిమ్ము నా భక్తిజ్ఞానము నెప్పుడిగా నిట్లుబలికెద గాక! (ప్రకాశముగా)

సీ. శ్రీమద్వైకుంఠపు • రీ నిలయుఁడవయ్యు
ధర్మపద్ధతి వీడి • తనకు టేమి
అక్షీణ లక్ష్మీక • టాక్షదీక్షుఁడవయ్యు
నిట్టికోరిక మది • నెంచు టేమి
పదునాల్గు భువనముల్ • పాలించు నేతవై
యీరీతిఁ బరసతి • గోర టేమి
సకలభక్తజన ర • క్షకుఁడవై, నేఁడిట్లు
మోహంబు నీభంగిఁ • బొందు టేమి

తే. గీ. చిత్రముగఁదోఁచె నీదగు • చిత్తవృత్తి
నాగుణము బరీక్షింప, మ • నంబునందు
దలఁచి యీవిధంబుననను • బల్కియుందు
వంతెగాని నీవేడ యీ • ట్లనుగు టేడ

భువనశాసనుడవై నీవు నా చిత్తము బరీక్షింప నిట్లు గోరితి వని తలంచెదను. కాకున్నచో నీవేడ యిట్టిబుద్ధిని బూను టేడ?

తమనవాశ్రిత మడంగునో, ఏదేవ దేవుని సేవాదవానలశిఖలు విపద్గహాటవిని దహింపజేయునో, ఏమహాపురుషుని భజనాంజనముచే నపవర్గనిధి గానిపించునో, యట్టి యాదినారాయణుండవగు నీవిట్టి కార్యము సేయుట కుద్యోగించిన నేనేమనగ దాన! పుండరీకాక్షా! ఒకవేళనీవు నాచిత్తవృత్తి నరయఁదలంచి యిట్లు బలికితివేమో! నీ వావిషయమున సందియమందఁబనిలేదు. పతిపదాంబుజసేవయు, భగవంతుడవగుత్వత్పదసేవయుఁదప్ప నన్యసుఖమేమియు గోరను కావున నాయందు గృపబూని, నీచిత్తమును మరల్చుకొని, నీభక్తురాలిగ నన్ననుగ్రహింపుము.

విష్ణు——

మ॥ అతివా! సందియమంద నేమిటికి సు ♦ వ్యక్తస్ఫీతిక్షుంద్ర దాగతిఁ సామాన్యతలోదరీమణిని నో ♦ కన్యార్తిగా మదింగోరి, యంచితమోదంబున జేరి వేడగను, వా ♦ సింబొందగా నెంచకే గతి, వాత్సల్యమ్మున మోహవాంగి కలదే ♦ కల్యాణి యొందైనమున్.

శశాంకవదనా! బృందా! ఇది యధర్మకార్యంబని చిత్తంబునఁ దలంపవలదు. మదీయాభీష్టము దీర్పుటవలన నీకుదుర్యశముగలుగునని తలంచవలదు. నాచేతఁజేయబడిన యెట్టికార్యమైనను ధర్మముగనే పరిగణించుచు ఇదియుంగాక నీవు నాకోరిక దీర్చితివేని, నన్నుగూర్చి మహాతపంబాచరించిన మహాసతియైన సందరాని దివ్యపదంబున నిన్నునిల్పెదను.

బృంద——

సీ. అఖిలజీవులను నీ ♦ వాడించుచుందువు
తోలుబొమ్మలగతిఁ ♦ దోయజాక్ష
కనుకట్టు గట్టెదు ♦ గారడీ డును బోలె
మిథ్యాప్రపంచమ ♦ మాయచరిత
జక్కుల వాడవై ♦ జనుల వివేకంబు
బాపుచుండెదవు ♦ దైవతిల లావు

వేదముల్ వేతువు • బృందారకుల్ వేద
బహువిధంబుల నీవు • భవ్యతేజ
తే. గీ. మోహమూనెద వారికపై • మోహమంద
జేతు వింకొకరిని నిల్లు • జెలఁగుచుండు
నీ మహామహిమఁ దెలియ • నీరజాస
నాదులకు నైన శక్యమా • హరి ముకుంద.

దేవా! నీయభీష్ట సుధర్మమైనదని చెప్ప సాహసించినందులకు నన్ను మన్నింపుము. నేను పరమసాధ్విని. పతిపదాంబుజ సేవయే సతికి భూషణమని యెంచిగిన దానను ఒకరిని సంతోషింపఁజేయుటకుఁగాని లేక స్వార్థము నపేక్షించిగాని నేను సాధ్వినై యుండు దానను గాను. పతిసేవ సతికి దైవచింతనకంటె నెక్కుడు మహిమ గలదని నేను గుర్తెఱింగితిని. అట్టి నేను సధర్మకార్యమాచరించితి నేని నా యాత్మ తిరుగ విముక్తి బొందుటకు సాధ్యమగునంతటి ఘోరనరకమునఁ బడఁగలదు. నా సాధుత్వముచే నిదివఱ కార్జించిన యశము మాసిపోవును. సతికి బతివ్రతాత్వమే సర్వసంపదలొసంగును అదియే సర్వాభీష్ట ఫలప్రదము అదియే సకలాఘ విమోచనము అదియే సజ్జన స్తవనీయము అదియే సంతోషకారణము వేయేల అదియే మోక్షసామ్రాజ్య సౌధారోహణమునకు సోపానము. కావున నా మనంబట్టి యధర్మమార్గంబుఁ బ్రవేశపెట్టి లోకులు నన్ను నీచముగ జూచునట్లు జేయకుము. భగవంతా! నీ పాదకమలములకు నమస్కరించుచున్నాను. నాయందుఁ గృపాంతరంగుఁడవై నీబుద్ధిని మరల్చుకొని, బృంద మహాసాధ్వియను యశోడిండిమము జగమున మ్రోగఁజేయుము.

విష్ణు—(తన లో) ఆహా! సూక్తోపదేశములగు నీమె వాక్యములు నా కెంతయు మోదము గొల్పుచున్నవి కదా, సంపూర్తిగ నీమె హృదయము గ్రహించినగాని విడువరాదు (ప్రకాశముగా) బృందా

నారాయణుండనగు నేను నిన్ను జేరియిట్లు వేడ, వలదని నిరాకరిం
చుట నీకు ధర్మమా ?

మ. తరుణీ యేమివచింతు నీకిపుడు నం ♦ తాపంబునుంగూర్చి యా
స్మరుఁ డుగ్రుండయి వేసి తూపులదరిం ♦ పంపచ్చి తాస్త్రాళిఁ జె
చ్చెరఁ బాధింపఁగ నిట్లు వచ్చితిని రా ♦ జీవాక్షి నిన్వేడగాఁ
గరుణన్ జూడుము నన్ను, నీకును యశః ♦ కల్యాణముల్ చేకురున్

బృంద—మాధవా ! నాహృదయము నీకు విశదపరచితిని. ఇంకను నీయనవసర ప్రసంగముతో నేమిపని యున్నది. చతుర్దశభువన నాయకుండవగు నీకుఁ గూడ మదనావస్థయేనా ? మదనుండు నీ తనయుఁడే కదా ?

విష్ణు—బృందా! మన్మధుడు తనయుండయిననేమి వాడు తన వారిని పెరవారిని ఒక్కరీతిగనే చూచుచు నీవిషయమున నాతఁడు నన్నుఁదండ్రి నగుదునని యైన భావింపక బాధించు చున్నాడు. ఒక్క మదనుండే కాదు. నాకుటుంబమున నున్న వారందఱును నాకు విచారమును గూర్చువారే!

సీ. నాజ్యేష్ఠ పుత్రుండు ♦ నలు మొగంబుల వే
ల్పశాశ్వత కార్యముల్ ♦ సలుపుచుండు
రెండవ పట్టిమా ♦ రుండు స్త్రీ పురుషుల
మోహ సాగరమున ♦ ముంచుచుండు
నిందిరాదేవి నా ♦ యిల్లాలు నిరతంబు
జంచల వృత్తిఁ జ ♦ రించుచుండు
భూమి దేవి ద్వితీయ ♦ ప్రాణోది యెప్పుడు
నిలచినచోటనే ♦ నిలిచియుండు

తే. గీ. వసతి రత్నాకరంబు మేల్ ♦ పాన్పు పాము
వాహనము పన్నగవిరోధి ♦ భళిర నాదు
చిత్రసంసార కష్టంబుఁ ♦ జెప్పవశమె
తెలియకున్నదె నాకథ ♦ కరికిమిన్న

బృంద—దేవా! ప్రస్తుత విషయమును గూర్చిన సంగతి గాదుగాని చెప్పుచుంటిని.

సీ. అవనిదేవియె నీకు ♦ సఖల భారకుడన్న
విఖ్యాతయశంబును ♦ గొలుపగలిగె
వలరమాదేవి నీ ♦ యాలియైభక్తమం
దారుడ నెడి బిరు ♦ దంబుగూర్చె
భారతీరమణుండు ♦ పట్టియైగొప్ప సం
సారి యనబడెడి ♦ పేరుదెచ్చె
పరమపావని దివ్య ♦ వాహినీ పుత్రియై
కలుషవాహనుడన్న ♦ ఘనతగొలిచె

తే, గీ. నిజము దలపోసి చూడంగ ♦ నీకునీదు
పరిజనముదెచ్చు ఖ్యాతియే ♦ ధరణినిండె
నీవు దామోదరుండవు ♦ నిశ్చయముగ
తెలియుదా నీదు చరితంబు ♦ జలరుహాక్ష

పంకజనాభ మహామహులకైనను దుర్లభంబయిన నీదివ్యమంగళ విగ్రహ సందర్శనము నాపురాకృత భాగ్యంబున లభించినది. నేను విగతకల్మషనైతిని నీవు నాచిత్తమారయుటకో లేక యుద్దేశపూర్వకముగనో తెలిపిన నీయభీష్టమును మనంబునుండి వారదోలి, దాసురాల నగు నాగృహంబునకు నే డతిథివిగమ్ము. నాశక్తి కొలది బూజించి కృతార్థురాలనగుదును.

విష్ణు—(తనలో) ఈరమణీమణి యెన్నివాక్యములయిన బలుకుచున్నది గాని, నాయభీష్టమునకు మాత్రము సమ్మతింపకున్నది. ఈమె హృదయము నిష్కళంకమైనది. ఈమెకు నాయందున్న భక్తివర్ణనాతీతము (ప్రకాశముగా) తరుణీ నేనడిగిన దొకటియు నీవు చెప్పునదొకటియుగ నున్నది నాకేమి సరియైన ప్రత్యుత్తరమిచ్చితవు. కాలహరణమునకు నాచిత్తమొకింతయు దాళదు.

మ. సరసీజాక్షిరో నాకు నీ విపుడు పూ ♦ జల్ సేతు వన్నందుకే
బరమామోదము గల్గె; గాని వినుమా ♦ భావోద్భవుండేయు భీ
కర బాణంబుల కోర్వలేక నినుఁగాం ♦ చం జేరి యాచింతు శ్రీ
హరినిఁ జిన్ను నంతిగాఁ దలఁది యి ♦ ట్లాడంగ నీకర్హమే.

బృందా! నీవు నన్నుఁ గరుణింపవేని, విరహాగ్నిం బడి మ్రగ్గుట నిశ్చయము. నేనిట్లయితినేని, సర్వజగత్క్షోభము గూడ తటస్థించును. ఇందులకుఁ గారణము నీవేయగుదువు. కావున నన్ను గటాక్షించి కృతార్థురాల వగుము. నాకుఁ బ్రీతి సేయుట సర్వజగంబులకును బ్రీతి సేయుట యగును.

బృంద—ముకుందా! నీవెంత చెప్పినను నాచిత్త మధర్మోద్యోగమున బ్రవేశింపదు. భువన శాసనుఁడ వయిన నీవిట్టి దుష్కార్యము సేయ దలంచుట యధర్మమగును.

సీ. అఖిల జగంబుల ♦ నజునిచే సృష్టింప,
నొనరించు మహిమ యే ♦ యూరు జేరె
భూరి చతురతో ♦ భువన శాసనమహో,
దత్తత యేమూల ♦ దాగియుండె
అశ్రాంత పరమ భ ♦ క్తౌఘసంరక్షణ,
బిరుద మేమహాసీయ ♦ దరికి జేరె
అమల భక్తముని గ ♦ ణామర పూజితో
దార ప్రభావ మెం ♦ దడఁగియుండె
తే. గీ. ఆదినారాయణాఖ్య యెం ♦ దలరియుండె
విశ్వ సన్నుత గుణ మెట ♦ వెలుగుచుండె
వీని నెల్ల మఱచి యవి ♦ వేకి కరణి
సాధ్వినగు నన్ను గోరుదే ♦ జలజనాభ!

ముకుందా! మహోన్నతపదవి నధిష్టించి యుండినవాడ వగుటం జేసి నిన్ను జగములెల్ల భగవంతునిగాఁ గొల్చుచున్నవి. నేనును నీయందు నిర్మలమైన భక్తిఁబూని చరించుచున్న దాననే ఇట్టి

యుధర్మ కార్యమునందు నీవు ప్రవేశించితివేని, నీమహోన్నత పద
మునకు భంగము గలుగును. భక్తరక్షణ కార్యము మఱది, యిట్టి
యధర్మవర్తనో ద్యోగమునఁ బ్రవేశింపఁ దలంచిన నీతో నీవిషయ
మగు ప్రశంస సేయఁ జాలను గావున నేను గృహంబున కరిగెదను.
దేవా ! నేనిట్లు బలికితినని యాగ్రహింపకుము. నీదివ్యనామస్మరణ
మాత్రము నాచిత్తమెప్పుడును నెడబాయదు (పోఁబోవును)

విష్ణు—(తనలో) ఆహా ! ఈమె నిశ్చల హృదయమెంతయు మతి కర్హ
మైయున్నది. (ప్రకాశముగా) బృందా బృందా! నీవునన్ను మోహ
సాగరమున ముంచి యరిగెదవా ?

చ. అరుగక నెంచవే జలరు ♦ హాక్షిరో నన్నిటు ఘోరమోహసా
గరమున ముంచివేసి, త్రిజ ♦ గంబుల గొజ్జగు నేను నిన్ను నీ
శరణిని వేడుచుండఁ గనఁ ♦ గా మదినెంచక యంతగా, నిరా
దరణవహింతువే ? భగవ ♦ దర్చన యిట్టిదె ? భక్తురాలికిన్

కుందరదనా! నేను నిర్గుణుండనయ్యు, గుణము గలిగిన వాడనై
ప్రకాశించుచుందును. నిర్మోహమున నుండినను సమస్త జగమును
మోహింపఁ జేయుచుందును. రమణీ ! నీచే నిరాకరింపఁబడి నే
నెట్లు మరలిపోవుదును? శ్రీహరి నగు నేను నీవిషయమున మనో
రథసిద్ధి నందకపోయినచో నాప్రభావమే ముండును ?

బృంద—ఏమీ మాధవా ? భగవంతుడవగు నీవు నీమహిమ పరదా
రల గూడు నిమిత్తమే వినియోగపఱుపఁ దలంచితివా ? అక్కటా
ఎంతసాహసము! నీహృదయము జగంబెఱుంగకలేక పోయెనుగదా

సీ తమకంబె నిన్నెయు ♦ త్తముఁడని కాదెసు
రులు దైవముగ నిల్పఁ ♦ గలిగినారు
సర్వేశుఁడని కాదె ♦ సకల భక్తసమితి
భూరి భక్తిసి నిన్ను ♦ బొగడినారు

ఘనమైన పదవిచ్చి • గని కాదె తావన
            శ్రేష్ఠులు నిల బెద్ద • జేసినాడ
అవ్యయుండని కాదె • యఖిల సవన క్ర
            ములయందు భోక్తగా • నిలిపినారు
తే. గీ. వీఁచె గాదె త్రిభువన • ప్రభుఁడనవగ
    దుర్లభపదంబు జేతికి • దొరకె నీకు
    గాన నిలుపుకొనగఁ జూడ • గౌరవంబు
    నిట్టి దుష్కార్యముల బొంత • కేగుఁ జేని
    నిజపదచ్యుతిఁ బొందెదు • నీరజాక్ష
  ఈ విధమున భాషించు నీమాటల నేనింక నిలువనోప.

(నిష్క్రమించును)

విష్ణు—బృందా! బృందా! అరుగుచుంటివా భగవంతుఁడనగు నా యెడల నింత నిరాదరణమా (తనలో) ఈమె సౌశీల్య పాతివ్రత్యములద్వితీయములై యున్నవి. నెమ్మదిగా నీ విషయమై యోచించెదఁగాక. (నిష్క్రమించును)

ఇది ద్వితీయాంకము.





# సతీతులసి.



## తృతీయాంకము.



రంగము:—(గాలవాశ్రమము ముందు జలంధరుడు—ప్రవేశము)

జలం—(తనలో) గాలవుని సతియగు చారుమతి సౌందర్యవంతులం దెన్నికఁగన్న కాంతయని వినియుంటినేగాని, యెన్నడును వీక్షించి యుండలేదు ఇప్పుడు నేనెట్లయిన యీ ముని యాశ్రమంబును బ్రవేశించి యాకాంత నరయవలయు. నా యుద్యమమున కనుకూలముగ గాలవు డాశ్రమమున లేక యున్నచో నాభాగ్యము పండినట్లే, (ఎదుటజూచి) ఎవ్వరో సుదతీమణియిట్లువచ్చుచున్నది. ఎవ్వరై యుండును చారుమతియేయై యుండును. (పరికించి) నా యనుచరులు చెప్పిన మాటలబట్టి చూడగా నీమెయే చారుమతిఁ యగునని తోఁచుచున్నది.

(తెరలో)

అమ్మా చారుమతీ భగవదారాధనకుఁ బుష్పముల దెచ్చుటకు నీవుగూడ వచ్చెదవా? (ఇంచుక యూరకుండి) ఏమను చున్నావు నాథు డాశ్రమమున లేదు గావున నీవు పోయిరమ్మనియా? సరే నేను పోయివచ్చెదను.

జలం.—(తనలో) ఆమెయే చారుమతి. ఆమె వాక్యములఁ బట్టి చూడఁగా గాలవు డాశ్రమమున లేడని తోచుచున్నది. నాయుద్యమమున కీసమయ మెంతయు దగియున్నది. భూపాలుఁడనగు నే నాశ్రమమునఁ బ్రవేశించుట కేవిషమయిన యభ్యంతరమును నుండదు కదా! (పరికించి) ఈమె సౌందర్యమునద్వితీయమైయున్నది. మునిపత్నుల కిట్టి సౌందర్య ముండునాయని సంశయించితిని గాని యీమెను జూడఁగానే సందేహము వాసినది.

శా. ఔరా కన్నులతీరు, చక్కఁదనమా ♦ హా! మోముచందంబు న
య్యారే నీలములన్ హసించు కురులౌ ♦ రౌరా, మిటారంబు, మ
ఝ్ఝారే చన్గవ యద్దిరా తను విలా ♦ సస్ఫూర్తి వహ్వారె యీ
నారీరత్నముబోలు సుందరినిఁ గా ♦ నన్ జాల లోకంబులన్

తే. గీ. కొమ్మగాదది ముద్దుల ♦ గుమ్మగాని
కలికిగాదది మదనుచే ♦ చిలుకగాని
కాంత గాదది రతనాల ♦ బంతిగాని
భామ గాదది సౌందర్య ♦ సీమగాని.

ఈ తరుణీ శిరోమణి వాఁడిచూపుల జూచెనేని, మదనుండే తన విలునమ్ములు నేలఁబడవైచి యీమెకు దాసుఁడు గాకయుండు నా ఈతలోదరిని వీక్షించినంతనే, యీయనంగుఁడు తన పుష్ప శరంబుల నాపై బఱవ సాగినాఁడు కానిమ్ము నే నీ యబ్జాక్షిం జేరి మదీయ మనోరథంబెఱిఁగించి కృతార్థుఁడనై యా కాముని గర్వమడంచెదఁగాక (ఇంచుక నడచి) ఇదిగో ఆమె బిందె గైకొని జలార్థమై కాబోలు నదికరుగఁ దలంచుచున్నది. భళిరా ఈమెసౌందర్య మిప్పుడు సంపూర్తిగా గానుపించుచున్నది.

ఉ. కన్నులకబ్బుదీర సిత ♦ కంజదళంబు మంజువైఖరిన్
గన్నుల జంద్రసారము ము ♦ ఖంబున బింబపుడంబు వాతెఱన్
బన్నగరీతి కీల్జడను ♦ పల్లులసొగసు శరీరశోభలన్
గ్రొన్ననగుత్తులన్వలకుఁ ♦ గొన్నశిలాసముచేతి చన్గవన్

దిన్నవి దివ్యచంపకము ♦ తీరు గొ తేరగు నాసికంబు నం
దెన్నఁగరాని సొంపుఁగల ♦ కెంపుఁబరాంగములఁ వహించె రా
జన్నగధాళధళ్యమును ♦ సన్న మొనర్చుచు విప్పుగుచ్ఛములే
బన్నినపావడంజిలుగు ♦ బయ్యెద గుత్తపు రైకకప్పులం
టన్నరయుంచి మధ్యనిక ♦ టంబునగాంచి ధరించి మంచిరా
కన్నలదీపిమించ కర ♦ కంకణముఁన్ పచరించి భద్రమున్
నెన్నడఁగింకిణీరవవి ♦ నిర్మల శైలినతిక్రమించి, చం
చన్నతరావలోకన ర ♦ సభ్రమచే హాగిణిన్ హసించి, య
య్యన్నులమిన్న ఓండెగొని ♦ యానదికేగను నీకుదేరఁగన్.

(పరీక్షించి) లేదు, లేదు మరలనే కారణముచేతనో బిందెనక్కడ బెట్టి యామె యిటువచ్చుచున్నది. నేను నెమ్మదిగా నీమె కంట బడకుండగాక. (యించుక మరుగునకుఁ బోవును)

(చారుమతి ప్రవేశించును)

చారు — (తనలో) పుష్పములు కోట కటిగినమైత్రేయి యింకనురాలే దేమి కారణమో

(జలంధరుఁడు - చారుమతి చూచునట్లు ముందుకువచ్చును)

చారు — జలంధరునిఁజూచి యించుక వెనుకకేగి తనలో) ఓహో యీతఁడు జలంధరుడు ఇప్పుడిక్కడియ్యెడ కరుదెంచుట కేమి కారణమో కదా!

జలం — (చారుమతిని సమీపించగా నామె వెనుక కేగుటజూచి) తాపసపత్నీ! నన్నుఁజూచి నీవు భయమందెదవేల? నేను పెరవాడను గాను. జలంధరుడ మునీంద్రాశ్రమమున నున్నవాడే!

చారు — (తనలో) మునిపత్నినగు నేనీతనితో మాటలాడి నందువలన నేమిదోషము సంభవించును. (ప్రకాశముగా) నృపాలా! వారాశ్రి

మమునలేరు సమిత్కుశఫలాహరణార్థమై యరిగినారు. ఇప్పుడే
యరుదెంచి భూపాలుండవగు నిన్నుఁదగిన విధంబున గౌరవింతురు.
అంతవఱకును నా శ్రమమున విశ్రమించి యుండుము.

జలం—(తనలో) ఆహా! ఈయువతీమణి మృదుమధుర భాషణము
నా కెంతయు సంతసము గొలుపుచున్నవి. నేను నెమ్మదిగా నాయభి
ప్రాయ మెఱింగించితినేని, యీమె తప్పక సమ్మతించునని యేతోఁచు
చున్నది. (ప్రకాశముగా) యోహామణీ! నీయాదరణంబునకు నేనం
తయు సంతసించితిని. కాని యొక విషయమున మాత్రము నిన్నుఁ
జూచిన నాకు మిగుల విచారము కలుగుచున్నది.

చారు—రాజేంద్రా! నీవు నన్నుఁ జూచి విచారింపవలదు. ఒక వేళ
మేము తాపసులముగదా నిన్నుఁ బూజింపలేమని నీవనుమాన
మొందఁ బనిలేదు. తపోగరిష్ఠుఁడగు మహాత్ముఁ డేతెంచి, భవత్పరి
వారంబునకును, నీకును గూడ విందు లిడఁగలడు.

జలం—

ఉ. విందు లొసంగ నేల, యర ♦ విందదళేక్షణ నాకు మీర లా
నందము మీఱ నిప్పుడు మ ♦ నంబున సంశయ మెల్ల వీడి నే
నిం దరుదెంచు కారణము ♦ నింపుగఁ జెప్పెద నీకు, దాని, నీ
వుందగ నాలకించి కృప ♦ బ్రోచెదవో సుఖిఁ బ్రోవకుందువో

మ. సురనారీ మణులన్ భుజంగసతులన్ ♦ క్షోణీశశుద్ధాంత సుం
దరులన్ గారుడవంశ కన్యకల, గం ♦ ధర్వాంగన శ్రేష్ఠలన్
జిర మోదంబున గంటిగాని, విను మీ ♦ క్షింపగ లేదెందు, నీ
సరియౌ కాంతను, నిశ్చయం బిదె సుమీ ♦ శీతాంశు బింబాననా.

చారు—(తనలో) ఈతఁడవసరము లేని ప్రసంగములోనికి దిగుచు
న్నాఁడు. ఈతని గుణములను గూర్చి మున్నె నేను విని
యున్నాను. అయినను భూపాలుఁడు గదా! ఆశ్రమమునకు వచ్చి
నప్పుడు గౌరవించకపోవుట యుక్తముగాదని భావించితిని.

జలం—రమణీశిరోమణీ! త్రిజగంబులను నత్యాశ్చర్యకరంబును నగు సౌందర్యము గల నీవొక బహుగుం దాపసినిగా నాలకష్టము లనుభవించుచుంటివిగదా! నీ సౌందర్యమును గూర్చి నాచారుల వలన నింతకు మున్న నేనక సారులు వినియుంటి, యెవడేని నిన్నొంటిగఁ గూరిచి సంభాషించు భాగ్యముఁ గలుగ కుండునా యని వేచి యుంటిని. అయ్యది నేటికి లభించినది. ఆలస్యము చేసినచో మోస మగును గావున నొక్కమాటలోఁ జెప్పెదను.

మ. వనజాక్షీ నిను జూడగానె నిను మా • పంతంబు తగ్గ బూని చం
దనిశాతాస్త్ర పరంపరల్ తనువు నిం • డగ జాలగీలించి నె
ట్టన హంసాది ఖగార్భటుల్ జొనిపివే • డ్కన్ మన్మథుండుండె, నీ
వనుమానింపక నన్ను గలిగొని భా • గ్యశ్రీలతోఁ దూగుమా.
రమ్మా నీకు త్తరాకమునఃపే నాపురంబునకుఁ బోవుదము,

చారు—(తనలో) అక్కటా! యీనృపాలుఁడకు నన్నుఁ జూడగనేమొట్టి దుర్బుద్ధి పుట్టినది. ఇప్పుడు నేనేమి సేయుదును. మునికన్యకలు గాని, నాథుఁడుగాని దగ్గఱలేరు. కానిమ్ము. ననీతనికి సామవాక్యములఁ బలికి హృదయమును నా దురుద్యోగము నుండి మరలించెదఁగాక! ఈలోపుగా తాపసకన్యకలు గాని నాథుఁడుగాని రాక యుండునా? (ప్రకాశముగా) రాజేంద్రా! నీవు నృపాలుండ వగుటచే గౌరవించక పోవుట యుక్తముగాదని తలంచి సంభాషించి నందుకు మాకుఁ గలుగు ఫలితమిదియా ?

ఉ. పాలన శీలము మ్ర విమల • భావము గన్పడ భూతలంబునుం
బాలనసేయు భూపతుల • భంగులెతింగియు నిట్టిరీతి దు
ష్శీలుఁడవై పరాంగనలఁ • జేరగ నెంతువె, ధర్మమానె, లో
కాళి హసింపవే నిను ధ • రాధిప! బుద్ధిమరల్పుమా వెసన్.

జలం—అన్నులమిన్నా! ప్రపంచమున నేనొకరిని లక్ష్యపెట్టువాడను గాను. నా చిత్తము నీయందుఁ జిక్కినది నాయభీష్టము నీకెఱింగిం

చెంతకేగి నీవు తప్పక యంగీకరింతువని తలంచివచ్చితిని. (ఎదుటఁ జూచుచు)

తే. గీ. అదిగో పరివార మున్నది ◆ యచట; రథము
నదిగో యెక్కుమా యిక నంత ◆ యంబు విడిచి
మత్పురంబును జేర్తు నా; మగువ వగుచు
సౌఖ్యములఁ బొందెదవు గాక ◆ జలజనయన.

చాయ — (తనలో) ఆశ్రమమున నానాథుఁడు లేని సంగతి నెఱింగియే యీతఁడు నాయెడల ద్రోహబుద్ధినిఁ బూని వచ్చినాడు. హా! పరమేశ్వరా! నన్నీ దురాత్ముని బారినుండి రక్షింపుము. (ఇంచుక యూరకుండి) దుష్టచిత్తుఁడగు నీతడు నేనేమి చెప్పినను వినఁడు. వీనితోఁ గొంతవఱకుఁ గాలయాపనము సేయుచుంటినేని యింతలోన చెలికత్తెగాని నాథుఁడుగాని వచ్చును. (ప్రకాశముగా) జలంధరా! నీ వీశ్వరుని నయనంబుల నుండి వెలువడిన కోపజ్వాల వలన జనించితివి. నీకుఁ దెలియని పరమధర్మము లెందును లేవు.

మ. చతురంభోధి పరీతభూవలయ రా ◆ జన్యాన్వవాయోత్తంస సం
తతి సేవింపఁగఁ జక్రవర్తివయి వ ◆ న్యాగ్రామదీక్షా కృశీ
కృతగాత్రిన్ మునిపత్ని నీగతి ధృతి ◆ శ్రీహీన చిత్తుండవై
సతిఁ గాఁగమ్మని కోరుచుంటి వకటా ◆ శ్లాఘింతురే నిన్ జనుల్

మ. క్షితిలో లేరె సతీమణుల్ నవవయః ◆ శ్రీరూపలావణ్య జృం
భిత లోభావర, నీకుఁ గోరఁగఁ దలం ◆ చేయున్న నీవట్టిచో
వ్రతులై నారలు గట్టి తాపసకుటీ ◆ రక్షోణి యందిట్లు సం
తతమున్ భర్తను గొల్చుచున్న దనరున్ ◆ గామించుటల్ ధర్మమే

జలం — రమణీ! కాముకులకు యుక్తాయుక్త విచారణముండదు. (ఇంచుక యూరకుండి) ఇంక నేను కాలహరణమునకు దాళఁజాలను (సమీపించు చున్నాఁడు)

చారు—(తనలో) ఈతఁడంతకంతకు మీఁదకు వచ్చుచున్నాఁడు. ఇచ్చట వీనిదుష్కృత్యమును వారించు వారెవ్వరును లేరు. (ప్రకాశముగా) భూపాలా! ఇదినీకు ధర్మముగాదు. నేను తాపసపత్నిని. సాధ్విని. పరాంగనారతము పాపమని యెఱింగియు నట్టి దుష్కార్యమునఁ బ్రవేశించుట నీకీర్తికిఁ బ్రాణములకుఁగూడ హానిసంభవించును. నామాటవిని నన్ను నీసోదరిగ భావించి వచ్చిన దారిని బొమ్ము ఇట్టిదుర్వృత్తిం బ్రవేశించి, సాధ్వీమణుల నోటినుండి వెలువడు శాపాతురమహాగ్ని జ్వాలలఁ గాలుతుండవు గాకుము

జలం—తరుణీ! నన్నీరీతి భయపెట్టఁ జూడకుము కామించి వచ్చిన నన్ను నీయంతట నీవాదరింతువేమోయని యింతవరకును గాలహరణమున కోర్చితిని. ఇంకనేనోర్వజాల నేనేనిన్ను బలవంతముగ రథముపైఁ బెట్టుకొని కొనిపోయెద (పట్టుకొనఁ బోవును)

చారు—(కోపముతో) ఔరా! ఏమి? నీసాహసము తాపసపత్నినగు నన్ను బలవంతమునఁ గొనిపోయెదవుగా! నీకు వినాశకాలము సమీపించినది. (నాధుని నుద్దేశించి) హా! నాథా! దుశ్శీలుఁడగు జలంధరుఁడు బలవంతమున నన్నుఁగొనిపోవ దలంచుచున్నాఁడు. సత్వరముగవచ్చి నన్నురక్షింపుము హా! మైత్రేయా! ఈసమయమున నీవైననున్నచో నీ దుర్మార్గుడిచ్చటకురాకయుండునుగదా?

(తెరలో)

ఎవ్వఁడాదురాత్ముఁడు! ఇదిగోవచ్చుచున్నాను.

జలం—(ఎదుటఁజూచి) అక్కటా? కార్యమునకు భంగమైనది. అదిగో గాలవుడే వచ్చుచున్నాఁడు ఇంకనేనిచ్చట నిలచియుండగాదు. మరియొక సమయమున నీమెనెట్లయినఁ గొనిపోయెదగాక.

(తొందరగాఁ బోవును)

చారు—(తనలో) అబ్బా? గండము గడచినది. ఈ నీచాత్ముఁడు నాథుఁడు వచ్చుచుండుటజూచి యీ ప్రదేశము విడిచినాడు. లేనిచో నాకట్టిహాని సంభవించి యుండునోకదా!

గాలవుఁడు—(ప్రవేశించి) ఎవ్వఁడా దురాత్ముఁడు!

చారు—నాథా, వచ్చితివా! ఈసమయమున నీవు రానియెడల నేనెట్టి యాపదను బొంది యుందునో కదా!

గాల—అదియేమి!

చారు—జలంధరుఁడు...

గాల—ఆదురాత్ముఁడు నేడు మన యాశ్రమమునకు వచ్చెనా పరనారీ హరణమానసుండగు నాతడు నీకెట్టి హానియుఁ జేసియుండ లేదుకదా!

చారు—నీరాక యాహానిని దప్పించినది. ఆతడాశ్రమమునకు వచ్చి యరిన మాటలన్నియు సావకాశముగ జెప్పెదను.

గాల—వానికి వినాశకాలము సమీపించినది, రమ్ము

(నిష్క్రమింతురు)

రంగము;—2. (జలంధరుని మందిరము.—ప్రవేశము జలంధరుఁడు)

జలం—(తనలో)

మ. అకటా! యేమియొనర్చువాడనిపుడ ♦ య్యబ్జాతపత్రాక్షి చే
తికిఁ జేకూరియుఁ దప్పి పోవుటను రా ♦ జీవాక్షు పుత్రుండు, మా
మకధైర్యం బెడలింపసాగెను నికం ♦ బబ్జాక్షి నెబ్భంగిఁ జే
తికి లభ్యంబగు నట్లుజేసి మదనో ♦ ద్రేకంబు వారించెదన్?

ఆనాడు గాలవుఁ డాసమయమునకు రాకయున్నచోఁ జారు మతిని నాగృహమునకుఁ జేర్చియే యుందును. (ఇంచుక యూరకుండి) మించిన దానికిప్పుడు యోచించినందువలనఁ బ్రయోజన మేమియున్నది ఎట్లయినను సమయమును వేచియుండి, చారుమతి బంధించుకొని రమ్మని భటుల కాజ్ఞాపించితినికదా!

బృంద—(జలంధరుని సమీపించి) ప్రాణేశ్వరా! నేఁడింత దీర్ఘాలోచన తత్పరుఁడవై యుంటివేమి? కారణ మెఱుంగ దగునా?

జలం—ప్రతివిషయమునందును జోక్యము కలిగించుకొనవలదని యెన్నిసారులు చెప్పినను నీవేల వినవు?

బృంద—నాథా! ఆగ్రహింపవలదు. రాజకార్య వ్యవహారమైనచో నేనా తెరువునకు రాను. కాని, నీచిత్త మితరాలోచన యందు మగ్నమై యున్నదని తెలియుచున్నది.

జలం—మనస్సు లోపల యూహా గూడఁ గనిపెట్ట దగినంత సమర్థురాలవు.

బృంద—నీ చింత పరనారీ హరణంబును గూర్చి కాకున్నచో; నాకు బెంగయుండదు.

జలం—అదిఁయైన మాత్రము నీ కేల బెంగ?

బృంద—పరనారీహరణము పాపమునకు మూలమని,

జలం—నీకు దెలిసిన మాత్రము ధర్మములు నాకుఁ దెలియవా?

బృంద—ఆర్యపుత్రా! నేనట్లుఁ జెప్పుటకు సాహసింపగలనా! సర్వ మెఱింగియుండియు నీ వే కారణముచేతనో నాకుఁ జింతఁ గూర్చుచుంటివి.

జలం—నేనేమి నీకుఁ జింతఁ గూర్చితిని.

బృంద—

సీ. మనసార నీపాద ♦ ఘనసేవఁ గొమ్మంచు,
నెన్నఁడైనను నాకు ♦ నిచ్చినావె
ముదమార నెప్పుడైన ♦ మృదుమధురిమవచో
సరణి నాకును జూపఁ ♦ జాలినావె

నీవె దైవంబుగా * నెంచియుండిన నాకు
తేనియ యొక్కింత, చూ ♦ పించినావె
యగ్నిసాక్షిగఁ గొన్న ♦ యతివ యంచును నన్ను
గానంత కరుణతోఁ ♦ గాంచినావె
తే. గీ. యకట! నీకు నర్ధాంగినై ♦ యలరునాకు
త వమునఁ గూర్చ నీకును ♦ ధర్మమగునె
నీకు దెలియని ధర్మంబు ♦ లోకమందు
గలదొకో నేనువచియింపఁ ♦ గలనె నాథ

జలం—ఇష్టములేని వివాహము సౌఖ్యము కాకరముగాదని నేను తొలుతనే తలంచితిని.

తే. గీ. అల స్వయంవర సమయంబు ♦ నందు నతివ
నాగళంబున హారమున్ ♦ వైవఁ గోయి
క్రిందఁ బడవేసినప్పుడే ♦ కుందరదన
భూరిదౌర్భాగ్య మొందితిఁ ♦ బూర్ణముగను.

బృంద—నావలన గలిగిన యానేరములేగా నీవిట్లు నన్ను నిరాదరించుట !

జలం—రమణి! అప్పుడు నేను వివాహ మక్కఱలేదనియే పలికితిని కాని, యానారదుఁడు నన్ను బలవంత పఱచుటచేత నిన్ను మెడకు గట్టుకొంటిని.

తే గీ. గంగిరెద్దుకు మెడలోన ♦ గంతయట్లు
గట్టుకొంటిని నినునేను ♦ కాంతమిన్న
యిప్పుడేమి చింతించిన ♦ నేమి ఫలము
ననుభవింపంగ వలయునా ♦ సజూ వాస్రిలు.

బృంద—ప్రాణేశ్వరా ! నామూలమున నీకు గలిగిన విచారమేమి ? యున్నది' పరదారాగమనంబు గలదియు తాపసుల బాధించుట తగదనియు జెప్పుటయేకదా నావలనదోషము ! నీశ్రేయమును నేనుగాక మఱెవ్వరు గోరుదురు ?

సీ. పరసతీ మణులపైఁ • గాంక్షింపఁ బాపమౌ
యంచు వచించ నా • లించినావె
మునిపుంగవుల చేతఁ • బోవలదంచును
జెప్పుమాటను జెవిఁ • జేర్చినావె
అమర సంతతిఁ గాంచి • హాసియింప దగదంచు
నేఁతచెప్పిన గుర్తు • నెఱిఁగినావె
ధర్మమే జయమను • తాత్పర్యమును బూను
మని చెప్ప నాపడీ • నరసినావె
తే. గీ. యిట్టివన్నియు మోదించి • యెనఁగుఁ గతన
నీకు నాపైననూయ • జనించగాదె
గాక యుండిన నాయందు • గలిగినట్టి
దోషమేమి నీకను దోచ • దో నిజేశ

మనోహరా! ఎంత భాగ్యమున్ననేమి ఎట్టిభోగము లుండిననేమి ఘోర విపదంబుధిం దరింపుటకు నావయు సంతాపదావాగ్ని ఘనవృష్టియు, పాపారణ్యమునకు లవిత్రంబును, మోక్ష సంధానకర్త్రియునగు పతిసేవకు దూరమైన సతిబ్రతుకేల!

(తెరలో)

ఈదురాత్ముల బారినుండి నన్ను రక్షించు పుణ్యాత్ములు లేరా?

బృంద—(ఆలించి స్త్రీయార్తరవము వలెనున్నదే)

దాసి—(జలంధరుని నుద్దేశించి) హా! నరపాలా! ఎంతదుష్కార్యము జేయించితివి ఇట్టిదుష్కార్యమునందు వర్తించుచున్న నిన్నుఁగాలుఁ డింకను గొంపోవక యుండెనేమి? పతివ్రతాశిరోమణుల నీవిధంబున జేయుట కేనా నీవుజన్మించినది.

బృంద—(తనలో) పాపము ఈమె యెవరో సాధ్వి. నధునిఁ దురంత కృత్యములకు మేరలేకుండెనుగదా! (ప్రకాశముగా) ప్రాణేశ్వరా ఈమె యెవరు?

జలం—ఎవరా! అన్ని విషయములు నీకే కావలయును. గాలవుని భార్య
బృంద—అక్కటా! ఎంత ఘోరము ఎంత ఘోరము! తాపసి పత్ని
యగునీమె యెడల నిట్టి కృత్యము నేయ సాహసించుట ధర్మమా!
చారు—(బృందనుజూచి) అమ్మా! బృందా! నీవును నాదు దానవుగదా
నీభర్తయున్న మాయాశ్రమమునకువచ్చి నన్నెన్నో మాటలాడి
తుదకీరోజున నిట్లుజేయించినాడు. ఈతడెవ్వడో సాధ్వీమణుల
శాపముచేతనే యంతమందును.

బృంద—(జలంధరునిఁజూచి)

చ. పరసతులెల్ల దల్లు ని ♦ భావములోఁ దలపోతువాని, యా
పరమపతివ్రతామణి, స ♦ పారగుణాకర నిట్టి భంగినన్
బరిభవమున్ బొనర్చుటది ♦ భావ్యమె, శ్రేయమౌ, చాలునింక, నీ
తరుణిని దల్లిగాఁగనుచుఁ ♦ తాపసి సన్నిధిఁ జేర్చగాదగున్.
ఇట్టి కార్యములే, గౌరవనాశమునకు, బ్రాహ్మణహానికిని
గారణములగును.

చారు—(బృందనుజూచి) తల్లీ! అట్లుచెప్పినన్ను రక్షింపుము.
జలం—(బృందనుజూచి)

మ. అలినీలాలక యిట్టి కార్యముల దా ♦ యన్ జేసి యుబ్బంగిపన్
బలుకం జెల్లునె నీకు, నిర్భయుక: నీ ♦ పర్మాత్మపై నాకు ను
జ్వలమోహాంబావంగ దెబ్బితిని, నె ♦ వ్వాడైన వారింపఁగా
దలఁపున్ బూని చరించునేఁ మదిని వం ♦ తంగుంపనీ కేటికిన్
బృంద—నాథా! ఆగ్రహింపకుము. సాధ్వీమణుల నీషధంబు సేయుట
తగవని చెప్పుటకు సాహసించుచుంటిని, నాకు, నీపదాంబుజసేవ
యొనంగలేనని యైనను చింతింపనుగాని, యిట్టియకార్యము నాయె
దుటజరుగుచుండ నేను సహింపగలనా! తుదకీకార్యములు బల
వంతముగ నాప్రాణము దీయును. ప్రాణేశ్వరా! ఏమో పతివ్రత నని
తలంపక యీమొఱ వినిపుచ్చుచును. (చారుమతిని శమియాపించి)

తల్లీ ! నీవు చింతింపకుము. నానాఘమొనర్చిన యపరాధమును సైపుము. నిన్ను మీ యాశ్రమమునకు సుఖముగాఁ జేర్పించెదను. రమ్ము. (చాయను తోడికొని లోనికిఁ బోవును)

జలం—(తనలో) గాలవృత్తము వస్తుత చేతనీచారు పతి యిప్పుడు నప్పించు కొనినది. ఇప్పుడుబృంద లోఁ దుపనది. ఈభటు లీమెను బృందయే యుందు నట్లు దెచ్చుటచే కట్లాయెనది.

సేవ—(ప్రవేశించి) మహారాజా! నారదమునీంద్రుడు వచ్చియున్నాడు.

జలం—(తనలో) ఈసమయంబున నితఁడేల యరుదెంచెనో కదా! (ప్రకాశముగా) మునీంద్రుని కభ్యంతర మేమున్నది? శీఘ్రముగా లోనికిఁ బ్రవేశ పెట్టుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించి వెంటనె నారదునితోఁ బ్రవేశించును.)

నార—(తనలో) ఈ జలంధరుని దుష్కృత్యము లంతకంతకు హెచ్చుచున్నవి. తక్కిన విషయము లెట్లున్నను, బరదారాగమనము అందులో మునిపత్నులను భంగమొనరింప దలంచుట యెంతయు ఘోరముగ నున్నది. కానిమ్ము, ఈతని దుష్కృత్యమునకు నేను దోడై శంకరునితోఁ గయ్యము సంభవించునట్లు జేసెదను. దానంజేసి కలహాభోక్తనగు నాకు సంతోషమొదవుట యేగాక, త్వరలోనీ దుర్మార్గుఁ డడుగంటుట గూడ సంభవించును.

జలం—(ఆసనమునుండి లేచి) మునీంద్రా! వందనములు ఈపీఠంబు నలంకరింపుము.

నార—(ఆసీనుడై) జలంధరా! నీకుఁగుశలమే కదా?

జలం—మునీంద్రా! నీకటాక్షమునఁ గుశలముగనే యుంటిని (ఇంచుక యూరకుండి) మహాత్మా! నీరాకచే నేను ధన్యుఁడనైతిని. ఇప్పుడు నెచ్చటికిఁ బోవుచు నిచ్చటికరుదెంచితివో యానతిచ్చెదవా!

నార—నేనిప్పుడు కైలాసమునుండి వచ్చితిని

జలం — కైలాసమున విశేషము లేమి ?

నార — నీ వక్కడ కరిగిన సమయమునఁ బరమేశ్వరుఁడు లేఁడు. గంగా పార్వతు లేకారణముననో కలహించుచుండిరి.

జలం — పరమేశ్వరునిజీవితకాలమంతయు నా సవతుల కయ్యము వారించుటకే సరిపోవుచున్నది. ఇంతకును కలహ కారణ మేమో నీకుఁ దెలిసెనా ?

నార — కలహకారణ మేమో నాకును దెలియలేదుగాని పర్యవసానము మాత్రము దెలిసినది. గంగ పార్వతిని నీవొకని చే బట్టుబడుదువుగాక యని శపించినది.

జలం — మునీంద్రా! తాను మహాసాధ్వినని యా పార్వతికిమిగుల గర్వమున్నది.

నార — ఈసంగతి నీవుగూడ గ్రహించితివి కదా ! ఆమె కొకసారిగర్వభంగము కావలెను (ఇంచుక యూరకుండి) జలంధరా !

తే. గీ. అరయఁబిచ్చుకపైన బ్ర • హ్మాస్త్రమున్న
పగిదిమానుల భార్యలఁ • బట్టిబట్టి
దలఁచుచుండెద విదియేటి • దర్ప గుణము
బలము కల్గిన నా "సతిఁ" • బట్టుమయ్య

ఇట్టి కార్యము నీవు సేయఁజాలితి వే ని నీయశము చతుర్దశభువనంబుల యందును నిండును.

జలం — తాపసోత్తమా! ఈసంగతి మంచి సమయమునందె చెప్పితివి. నేనిప్పుడు పార్వతినిఁ బట్టితిసేని యామెకుగర్వభంగమగుటయేగాక గంగ యిచ్చిన శాపము గూడ నిజమగును.

ర — జలంధరా ! మాటవలనఁ బ్రయోజనము లేదు.

ం — నారదా ! నేను మాటలఁజెప్పు వాఁడనుగాను.

## వ తీ తు ల సీ.

ఉ. ఏనిదె యేగి యానతిని ♦ నింపు దలిర్పగఁ బట్టితెత్తు; శ్రీ
జానియు భారతీపతియు ♦ శంకరుఁడున్ మఱి దేవబృందమున్
బూని రణంబుఁజేసినను ♦ బూర్ణపరాక్రమశౌర్యవృత్తినిం
గావగఁజేసి యోర్చెద ॥ ♦ గంబునఁ బ్రాకఁగ మన్యశోలతల్

ఇప్పుడీ మాటలతో నేమిపనియున్నది ? పార్వతినిఁ బట్టితెచ్చి నప్పుడు నీవే చూచెదవుగాక !

నార — నీవు తలంచుకొన్నచో నెంతటిపనియైనఁ జేయగలవు. కాని శంకరుఁడు లేని సమయముఁజూచి యాకార్యము జేయుము. ఈ విషయమై నేను బ్రేరేచితినని యెక్కడను జెప్పవలదు. ఈ సంగతి యతిరహస్యముగా నుంచుము. నేను పోయివచ్చెదను.

జలం — మునీంద్రా ! వందనములు.

నార — (ఈవలకువచ్చి) ఈయుద్యమమున నీతఁడు ప్రవేశించెనేని రుద్రుని కోపానలజ్వాలలకు భస్మమగుట నిశ్చయము. అట్లుగాక, బృంద మంగళసూత్రమహిమంబున నీతఁడు బ్రదికెనేని యప్పుడింకొక మార్గమును జూడవచ్చును. (నిష్క్రమించును)

బృంద — (ప్రవేశించి) నాథా ! నారదుండు కాబోలిప్పుడు వచ్చినాడు.

జలం — అవును (ఇంచుకయూరకుండి) చారుమతినిఁ బంపివేసితివా !

బృంద — ఇరువురు సేవకులను, నొక చెలికత్తెను నామెకుఁ దోడిచ్చి, గాలవుని శుశ్రూషణ కోరుకొమ్మని చెప్పి పంపితిని. నాథా ! ఇంక నీ వెప్పుడును నిట్టి యకార్యము లాచరించ వలదని నా ప్రార్థన.

జలం — నేనొనర్చుచుండు నిట్టి యకార్యము లన్నిఁటికిని నీవువిఘాతము గలిగించుచుంటివి.

బృంద — నాథా ! నాబ్రతుకు నీకంతకష్టముగ నున్నచో భవదీయహస్తాలంకృత కృపాణముతో నాకంఠమును దెగవేసిసుఖింపుము. అంతియెగాని యిట్టి యకార్యములకు నేను సమ్మతింపను.

జలం—(కోపముతో) సరే, యిప్పుడీచర్చ యెందుకు? నేనిప్పుడు కై
లాసమున కరుగవలయును.

బృంద—పరమేశ్వరుని సందర్శించుటకా?

జలం—కాదు కాదు, మహాసాధ్వినని చెప్పుకొనుచుండు పార్వతికి
గర్వభంగ మొనర్చుటకు.

బృంద—(తొందరతో) ఆ! ఏమిది? పార్వతికి గర్వభంగమా?

జలం—అవును. అందుకు సందియమేమున్నది.

మ. అమరుల్ భీతిలి, సిద్ధయక్షగణ మా ♦ హాకారముల్సేయ, శ్రీ
రమణుండున్ హరుడున్ విధాతయును సం ♦ గ్రామంబునన్ నిల్చి దు
ర్దమశౌర్యంబును జూపినన్ విడువకే ♦ రాజద్బలాటోపతన్
గమనీయోజ్వలదేహ నాపతిని వే ♦ డ్కన్ బట్టితో తెచ్చెదన్.

బృంద—(భయమునటించి) హా! నాథా! ఈబుద్ధి నీకేపుట్టెనా! ఎవ్వ
రైన బోధించిరా! లోకమాతయగు పార్వతియెడ నీవేడ ఆమెకు
గర్వభంగ మొనర్చుటేడ! ఇట్టి యకార్యము సేయుట యాత్మనా
శనమునకు గదా! నాథా! యిందుకు నేనేమని వగతును.

తే. గీ. శక్తిరూపిణి యైన యా ♦ సాధ్విఁ జేర
నెంచుటది చూడ ఘనమంచు ♦ నెంచి యొగసి
యగ్నిఁబడి మిడత చంద ♦ మగు గాదె
వలదు నీకిట్టి కార్యంబు ♦ వలదు వలదు

తే. గీ. నీదు జన్మకు మూలమా ♦ నీలగళుని
దేవి యైనట్టి సతిని బం ♦ ధింపఁ దలచు
టెంత దుష్కార్యమో మతి ♦ నెంచినావె
తల్లి కడుపుపైఁ గొట్టంగఁ ♦ దలచు నెవఁడు

ప్రాణేశ్వరా నీచిత్తము నీ యుద్యమము నుండిమరల్చి సుఖింపుము

జలం—తరుణీ నీవు నాకెట్టి భయమును గొలుపవలదు. నేను తలంచిన కార్యము నెరవేరు వఱకు నిద్రించు వాడను గాను. నీవీ విష యమున మాకు బలుకక యుండుము.

బృంద—హానాథా! ఇదియేమి సాహసము.

సీ. పరదేవతా కృపా • ప్రాప్తభూపాలనై
శ్వర్య భోగంబులు • చాలలేదొ
మహనీయమణిమయ • మందిరాంగణవాస
సౌఖ్యసంతోషముల్ • చాలలేదొ
సకలసామంతరా • జన్య సమూహంబు
నలుపుచుండెడి నుతుల్ • చాల లేదొ
అఖిలలోకనిర్మల • ప్రఖ్యాతి భాసురాకృతియు
శౌర్యసాహసములు • చాలలేదొ
తే. గీ, పరుల కాంతలఁబట్టుకై • పాపమునకు
డోడు పార్వతీ దేవినిఁ • గూడఁ బట్ట
సాహసించుచు నుంటివి • శౌర్యవృత్తి
నమ్మహాదేవి మహిమంబు • నరయలేక.

నాథా తపియించుచుంటిని నాకు నీతోడనే యున్నది నాయందు నీవు కరుణించక నీపాదసేవకు నన్ను దూరముగ జేసినను నిరంత రము నీసేవహృదయమునందే నేయుచు సాధ్వినై యుంటిని అట్టిచో నీ విప్పుడు సతీదేవినిఁ బట్టనరిగి నాకు దురంత చింత గూర్ప వలదు.

జలం—నేను నీయెదుట నన్నంతవరకు నేదియో యనవసరమైన సంభాషణ నేయుచు నేయుండుము నేనిదే కైలాసమున కేగి నమ యము వేచియుండి సతీదేవిని బంధించుకొని వచ్చెదనుగాక.

(నిష్క్రమించును)

బృంద — హా నాథా ! నాథా ! (పరికించి) ఇంకెక్కడనాథుడు! ఈతడు నామాటలు పెడచెవిఁబెట్టి శై తన మూర్ఖమై యరిగినాడు. ఇప్పుడు నేనేమి సేయుదును. ఎవ్వరిని వేడుకొందును. ఈతఁ డట్టియ కార్యము జేసినేని త్రినేత్రునికోపాగ్నిజ్వాలలందుబడి భస్మముగాక యుండునా! అక్కటా ఈతఁ డట్టి సాహసకార్యము నేయనెంచెను! (ఇంచుక యూరకుండి) ఇప్పుడు నేను విచారించుచున్నందువలన ప్రయోజనము లేదు. నేనుగూడ నరిగి నాథునియత్నమును గని పెట్టుచు నాశక్తికొలఁది వారింపఁ బ్రయత్నించెదగాక.

[నిష్క్రమించును]

ఇది తృతీయాంకము.





# సతీ తులసి.

## చతుర్థాంకము.

రంగము:—(1)[కైలాసపర్వత ప్రాంతమున సతీ దేవి. ప్రవేశము]

సతి—(తనలో) పరమేశ్వరుని భార్యనైన నాకుఁగూడ సవతిపోరు కదా ఈ కలహములఁజూచి ప్రాణేశ్వరుడుపరిహాసము సేయుచుండును. ఇట్టి కలహములు స్త్రీ తనలోదామే యంతరింపఁజేసికొనవలయును గాని పరవారికిఁ జెప్పుట యెంతయుఁ జులకన కదా! కలహ సందర్భమున నాగంగనన్నుఁ గూర్చి పలికినయా వాక్యము నాహృదయమున నొక్కింత యనుమానము గలిగించుచున్నది (ఆలోచించి) రుద్రాణివగు నన్ను నెదు బట్లసాహసించును నాయనుమాన మే నన్ను బాధించుచున్నది. ఇది మరియొకటి కాదు (ఎదుటజూచి) నన్నిప్పు డందులకు చెప్పిపోయిన చెలికత్తెయింకను రాకయున్న దేమి? వచ్చుచున్న దేమో యా చెడగాలి. (ప్రతీక్షించును)

(జలంధరుడు ప్రవేశించును)

జలం—(తనలో) నేను నిన్నటినుండి వేచియుండగా, నిప్పటికి పార్వతియొంటరిగా నుండజూచుభాగ్యము గలిగినది. ఎదుట జూచి అహో అయింతి (పరికించి) ఈమె సౌందర్య మద్వితీయమైనది.

ఉ. వేయితలంప నేమిటికి • విశ్వపదార్థములందు గల్గు బల్
సోయగ మొక్కచోట నిడి • చూడగ గోర్కెజనించియుండు వా

నీయావతీప్రియుండు ♦ శశి ♦ నీరరుహాద్యుపస్థానవస్తుల
తాృయతబుద్ధిఁగూర్చి పెల ♦ యుంగను జేసెఁ దరోదరీమణిన్.

ఇట్టి నారీమణి లభించుటచేతనే ఈశ్వరుఁడు మహాదేవుఁడైనాఁడు (ఇంచుక యూరకుండి) నేనిట్లాలోచించుచు నున్నందు వలనఁ బ్రయోజనము లేదు. ఆలస్యము జేసితినేని కార్యభంగమగును. సత్వరముగ నీమెను బట్టుకొని విమానముపైఁ బెట్టుకొని నిజనగరము చేరెదను. (నిష్క్రమించును)

సతి—ఆ! దురాత్మా! ఎవ్వడవురా నీవు? సాహసంబున నన్నుఁ బట్టవచ్చితివి. (అనిపలుకుచుఁ సతీదేవియు వెంట జలంధరుఁడు ప్రవేశము)

జలం—సతీదేవినిఁ జూచి)

ఉ. ఏను జలంధరుండ, రమ ♦ ణీమణి నన్ను నెఱుంగవో ప్రియా; నీ
మానితసుందరాకృతికి ♦ మానసమందున జాలమెచ్చి యూ
నూనశరార్తికిన్ మిగుల ♦ సొక్కి నిరుగ్రగొనిపోవఁగోర్కితో
నేనిటకేగుదెంచితిని ♦ నీరజపత్రవిశాలలోచనా.

సతి—(కోపముతో) ఓరీ! మాతృద్రోహీ! ఎట్టిసాహసకార్యము నేయ నెంచితివిరా! తల్లినగు నన్నే బట్టవచ్చితివా! నీవిట్టిపరమపాతకుఁడవగుదువని తెలియక బ్రహ్మరుద్రులు నిన్ను మహదైశ్వర్యవంతునిగాఁ జేయుటంజేసి యిట్లు దుష్కృత్యములు నేయుచుంటివి.

తే. గీ. తగని పురుషునకును దొడ్డ ♦ తనము గూర్చ
నగడు పడుటయె కాని పో ♦ దలఁతి తనము
పిల్లకుక్కను వోడ్డిచ్చి ♦ పల్లకి నిడి
యూరతిచ్చిన నది దివ్వో ♦ లార్పు గాదె

బాల్యమునందే నిను శ్రీహరిఁ జంపదలంచియు; బరమేశ్వరుని మొగముజూచి యూరకుంటుంటచే నిట్టివాడవైతివి కానిమ్ము.

రుద్రుని కోపానల జ్వాలల కాహుతికాఁగోరియే నన్ను నీవిట్లుబట్టుటకు సాహసించితివి.

జలం—సుదతీమణీ! ఈయుత్సవసంభావనతో నేమిపని యున్నది? నే నొకమాటఁ జెప్పెదను వినుము.

సీ. ఆవాస మెన్నంగ ♦ నతిభయంకరమైన
భూతంబు లుండెడి ♦ ప్రేతభూమి
ఆహార మెంచంగ ♦ నన్యులెవ్వరు దరి
జేరఁగాఁ జాలని ♦ ఘోరవిషము
వాహనంబు దలంపఁ ♦ బహానమును నేయు
నిరతంబు దలయూచు ♦ వృషభమూర్తి
బిచ్చమెత్తఁగ నెంచ ♦ వేడ్కమై హస్తంబు
నఁ ధరించినది యా ♦ నలువ శిరము

తే. గీ. పాముతో నగలు, హితులు ♦ ప్రమథగణము
గాఁగ నిరియించుచుండు నీ ♦ కాంతు డేమి
సౌఖ్యముల నీయఁజాలును ♦ సారసాక్షి
రమ్ము పోదము నాదు పు ♦ రమ్మునకును.

బాగు నేయుక లెమ్ము. (నమినాపించును)

సతి—కులువా! దూరముగా నుండుము. పరమేశ్వరుని మహామహిమ నెఱుంగక యిట్టి యకార్యము ను జేయవచ్చితివి. నిన్ను నేనే దగ్ధము జేయగలుగుదును గాని, నాథునియాజ్ఞ లేక పోవుట చేతను, నీ భార్యయు పతివ్రతాశిరోమణియునగు బృందంజూచియుఁ గరుణించితిని. ఇంతవరకును దాపసుల నేచుచుఁ దత్పత్నులఁ బలిమిబట్టుచు నాచరించిన ఘోరపాపము చాలక నాకడకు కూడ వచ్చితివా!

జలం—పతివ్రతాణీ! నీవు నన్నిట్లు తృణీకరించి పలుకవలదు. నీసౌందర్యము నంకీర్తన మెంతయుఁ దగనివాడు

తే॥ గీ॥ ఉవిద జవ్వనివి సుఖంబు • లొల్లకిపు
బడుగు జోగికి భార్యవై • బరగి తేల
రాత్రి ముఖమునఁ జంద్రతా • రాప్రకీర్త
మైన శర్వరి యట్లున • కగుని చెప్పుము

ఈమాటలతో నేనిపత్రివ్రాజనమున్నది? రమ్ము. నాపురమున నన్ను గూడి సుఖంచెదవుగాక? (సమీపించును)

పతి—నీ కాయువు మూడినది. ఇంక కాలమిచ్చట నిలిచి యుండుము పరమేశ్వరుని మహిమ నీకుఁ దెలియును.

జలం—ఆతని మహిమ తెలియలేను!

క॥ తనువు వికారపాత్రము, పు
ట్టనఁ గనరా దేకిరి దీ • గంబరకు నెరుం
గనగును, ధనమను మాటరె
గనరా దతని మహిమంబు • గానని జగతిన్.

శివ్రకంఠునికి గట్టిపిట్టిన తల్లిదండ్రులు నీకెంకయు శోకము గూర్చిరి నిరంతరమును మణిసౌధంబులయందు మెలఁగునీచరణము లాతవితో పిశృవనంబున మెట్టుట కెట్లోర్చుచున్నవి?

క॥ శ్రీ చందనాప్పదములగు
నీచనులు శ్మశానధూళి • నెగడుటకంటెన్
నీచం బొందు గలుగునె యా
హా! చపలాక్షిరో సుఖంబు • నట్టిది యౌనే.

పతి—ఓరి! దుర్మతీ! బీదయు, సంపద్ధేతువును స్మశాన సంచారియు జగత్పతియునగు శివుని మహత్త్వము నీబోటిమందు లెఱుంగఁ జాలరు (ఇంచుక యూరకుండి) నీతో నాకుఁ బనేమి? (ఇంచుక నడచును.)

జలం—శైలతనయా! నాబారిఁబడిన నీవెచ్చటి కరిగెదవు? నిలువుము. నిన్నిప్పుడే నాపురికిఁ జేర్చెద. జలంధరుఁడు పట్టినపట్టు విడుచువాడు కాడు. (సమీపించి పట్టఁబోవును)

సతి—(పరమేశ్వరుని నుద్దేశించి) హా! పరమేశ్వరా! నీవిచట నుంటివి! ఈ జలంధరుఁడు దుర్మార్గుఁడైనన్ను బట్టఁదలంచు చున్నాడు. సత్వరముగ వచ్చి రక్షింపుము.

జలం—

మ. జలజాక్షీ భవదీయనాథుఁడగు నా ♦ శంభుండ దేతెంచియు
జ్వలదర్పంబున నిల్వనిమ్మిపుడు మ ♦ చ్ఛౌర్యంబునన్ సంగర
స్థలిలో వానిని రూపుమాపి సురబృం ♦ దం బెల్ల భీతిల్లగా
బలిమిన్ నిన్ గొనిపోదు నాదుపురికిన్ ♦ బల్మాటలిం కేటికిన్.

(పట్టుకొనబోవును)

సతి—(తప్పించుకొని అటు టుజూచుచు, ఓరీ! కాంధకారపరిమత్తహృదయా! దూరముగానుండుము.

జలం—హిమగిరితనయా! నేను రుద్రునికి భయనుందుదునని తలంచితివేమో (దగ్గరకుబోవును)

(తెరలో)

చెలీ! పార్వతీ! పార్వతీ! ఇదియేమి, నిన్ను బట్టఁ బూనుచున్న యీ దురాత్ముఁ డెవఁడు? పరమేశ్వరు డీప్రాంతమునందె యున్నవాడు ఆతని కెఱింగించెదఁగాక నీవు భయపడవలదు.

సతి—(తనలో) ఇంక భయములేదు ఈదురాత్ముకు నాథుని క్రోధాగ్నిజ్వాలల కాహుతియగును.

జలం—(తనలో) ఓహో! ఈమె చెలికత్తె యీ ప్రాంతమ ననే యున్నది కాబోలు. ఈవార్త శివుని కెఱిఁగించిన నాతడు రాగలఁడు.

చతుర్థాంకము.

ఇప్పుడు నేనేమి సేయుదును. (ఆలోచించి) శివుఁడొక్కఁడే కాదు. ఆతనికి తోడింకెవరైన రాసున్నా. వతిని మాత్రిము విడువక యుం డుముగాక! సాధ్యమగునంతవఱకు కాతఁడు రాకమునుపే యీ కాం తను బంధించుకొని పోయెదను. (వతిని సమీపించి) లెమ్మా. లెమ్మా ఇంకఁ గాలహరణము నకు నాచిత్త మోర్వదు.

పతి—దుర్మతీ! నీవుఁ గాలము సమీపించినదే. ఉండుము.

(తెరలో)

మ. సురముఖ్యస్తవనీయుఁడైన సతిఁ గన్ ♦ సొంపార బంధింప, నీ దురితాత్ముం డు జలంధరుఁ డౌ వానిని జగ ♦ ద్ద్రోహిన్ నిమేష బులో మరబృందంబు నరింప శూలమున ని ♦ చ్చోఁ జవగాజేతు; ని ర్భర మహోగ్ర పదవాలనంబును సహింప * పన్ శక్తుఁడె వ్వాఁడగున్

పర—(పై పద్యమును జదువుచుఁ బ్రవేశించి యిటునటు జూచుచు న్నాఁడు.)

పార్వ—(పరమేశ్వరు నుద్దేశించి) హా! నాథా! దుర్భాగ్యుడగు జలం ధరునిచేఁ జిక్కిన నన్ను రక్షింపుము.

పర—(జలంధరునిజూచి) ఓరీ! దుర్మతీ! నీవా! ఇట్టి సాహసకార్యము నకు సాహసించితివి.)

ఉ. భామిని నీవిధంబునను ♦ బట్టఁగ నెంచిన నిన్ను మామకో ద్దామ కుక్షిధాగ్ని కాహుతిగఁ ♦ దప్పక చేసెద: జూపుమీవు సా ధ్వీమణు లెల్లరున్ మదుల ♦ భీతిని వీడి చరింపఁగా, ముని స్తోమము గూర్కుఁడీగ్లె నను ♦ చున్ ముదమందఁగదుర్మదాంధమా

(సమీపించి) ఓరీ! జలంధరా! ఇంతవఱకును నీవు చేయుచుం డిన దుష్కృత్యములఁగూర్చి నేను వినియు, నెవరు చేసిన పాపము వారే యనుభవింతురని యూరకుంటిని. ఇప్పుడు నీవీ తుపారక్షోణి

భృశ్యన్యను గూడ బట్టుటకు సాహసించితివిగా! ఇంతకును నిన్నన వలసినబని యేమియు లేదు నాకారణంబున జనించిన నీ వరాహమునకు దప్పై యుండకుండ నిన్నొక రాజుగా జేసి వరంబులిచ్చి నందుకు మాకు గలిగిన ప్రతిఫల మిదియేకదా!

తే. గీ. ఎఱుక మాలిన వారల • కెంత మేలు
గూర్చిన దాని దెలియంగ • లేరు జగతి
బిడ్డయని రొమ్ము మెడమీద • బెట్టుకొనిన
దేహమంతయు జెఱచుగా • దేదురాత్మ.

జలం—(పరమేశ్వరుని జూచి) శంకరా నీవాక్యములకిచ్చట భయపడు వారెవ్వరును లేరు. భాగ్యభోగంబులు లేక, జోగివలె నిరంతర మును ప్రేతభూమిని విహరించు నీ సౌందర్యవతియగు నెలనాగ యేల? ఈమెను నాకొసంగుము ఎట్లయినను నీ హిమాచలాత్మజను గొనిపోవుటకే వచ్చితిని. నీవు మాటలతో నొసంగవేని నిస్సారణ మున నిర్జించియైనను దోడ్కొనిపోయెదను.

పర—ఛీ! మాతృద్రోహీ! ఇట్టియవ్యక్తప్రలాపంబులాడకుము

మ. సమదాటోప పతంగపుంగవవిధాన • స్వర్గి చంచూసమ
ద్ధమునం దల్ప ఫణావిజృంభణకల • త్కాకోదరంబట్లు శౌ
ర్యమదోద్రేకుడవాచు నన్నిపుడు జ • న్యక్షోణిసిందాక జి
త్తమునం దెంచితి వే దురాత్మ యిక నీదర్పంబు వారించెదన్

నాపరాక్రమమునుగూర్చి నీవిదివఱ కెన్నడును వినియుండ లేదు కాబోలు

జలం—వినియుండ కేమి

మ. గరిమన్ నిన్నెదిరించు వీరవరు డొ • క్కండైన లేకుంటచే
నసుదారన్ భవదీయశౌర్య ఘనివా • ర్యంబై సుధీస్తుత్యభా

స్వర నంస్తోత్రత కర్వాసికదుబరికా • శంబమ్యే; నింకన్ జలం
ధరుమౌళికా భవదీయ విక్రమము న్య • ర్థంబౌ సుమావల్లభా

ఈ జలంధరుండు రాజాధిరాజై విలసిల్లుచుండెనని యెఱుంగవా
యేమి?

పర—ఓరీ! నీవు రాజాధిరాజు నని గర్వించుచుంటివా? ఇటువినుము
చిత్రాభరణపటస్థితిం బ్రకాశించుటయుం, జామరానిలావృతిని గను
టయు, మదోన్మత్తకాయమున విఱ్ఱవీగుటయు మానవ్వభావమున
నుండుటయు వాద్యధ్వనితో స్వారివెడలుటయు, బరులదూరంబు
గాం దరుముటయుం దనవారివాక్యములు విని తలయూచుటయు,
జుట్టును ననేకులచే, బరివేష్టింపంబడుచుండుటయుం రాజమాత్రుండ
వైన నీకేయుండలేదు. ఇవియన్నియు గంగిరెద్దునకుంగూడ నున్నవి
ఓరీ! గర్వచిత్తా! వివేకజ్ఞానశూన్యుండవైన నీవు రాజువైననేమి
కాకున్ననేమి?

సతి—(పరమేశ్వరునితో) నాథా! దుష్టచిత్తుండగు వీనితోం గాల
యాపనమేల?

జలం—నిజమే వృథావచనములతో నేమిపనియున్నది? (పరమేశ్వ
రునింజూచి, ఓయీ! పితృవనవిహారి! నేనీశైలసుతను దోడ్కొని
పోవుటకు నీవు సమ్మతింతువా? లేక రణంబుననిల్చి నాతోం
బోరెదవా?

పర—(కోపముతో) దురాత్మా! ఏమనిరా ప్రేలితివి (త్రిశూలము
చేం బొడువంబోవును)

జలం—(తప్పించుకొని) రమ్మ. రమ్మ

ఉ॥ ఆహవనామకాధ్వరము • నందు మదీయభుజోల సత్ప్రదా
సాహసచాపముక్తశిఖి • తామ్రమహాగ్నికి నిన్ను నిప్పుడా

జ్వాలాహుతిగా నొనర్చునుర యంబున నీమెను గొంచుబోదు మి
త్సాహసవిక్రమక్రమము శౌర్యము జూడుము భూతనాయకా.

పర—(కోపముతో) నీతో రణముగూడ సేయవలయునా?

మ॥ తరుణీ సాధ్వినిలోకమాతను, సురేం ద్రస్తుత్యపాదాంబుజన్
బరిభావింపఁగఁ బాపమానసుడవై భావించుటేగాక, సం
గరముఁ జేయఁగ నెంచుచుంటివె ధళీ కష్టాత్మ నాతోడ, భీ
కరశక్తిన్ బొలియింతు నిన్నిపుడె లో కంబుల్ ముదంబందగన్

దుర్మార్గచిత్తుఁడవగు నిన్నింకను బ్రిదుకనిచ్చితినేని, లోకముల కపకారము జేసినవాడనగుదును ఇదిగో! శక్తిచే బ్రయోగించి నీ ప్రాణముల హరించెదగాక.

(అంత దొందరగా బృంద ప్రవేశించును)

బృంద—(పరమేశ్వరుని పాదములపై బడి)

తే॥ గీ॥ శంకరాయ భక్తజనవ శంకరాయ
కంధరాయ మహానీల కంధరాయ
పురనిశాచరకర్మశ పురహరాయ
పార్వతీరమణాయ తు భ్యం నమోస్తు.

మ॥ నతసర్వామరశీర్షసన్మకుటసం ఘాతానుబునన్ వేవి కాం
తితతుల్ భానుని మించు తేజమున సం దీపించుచుండెవ్వి. సం
స్తుతనానామునిభక్తమానసగృహా ప్రోద్యంబులన్ దివ్యమై
నుతిసింగారించెను నట్టి నీపదములన్ గొల్తున్ సదాభక్తితోన్.

పరమేశ్వరా! సర్వాంతరాళానువర్తీ! పుణ్యమూర్తీ! బుధత్రాణలోలా! భవదీయ పాదారవిందస్మరణము, ఖగేశ్వరుడహివ్రాతమును హరించు చందమున సమస్తపాపములను నశింపఁ

చేయుము. అట్లైన నేను నీచరణంబు వేడుచుంటిని. నీక్రోపము గన్నుదెఱచి చూచితివేని, యాతఁడంతవాఁడు నా నాథుఁడు సద్గుణమూర్తియని నేను చెప్ప సాహసింపను నా సాధ్వీత్వము దిలకించియైన నీతనిని రక్షించి నాకు బతిభిక్ష బెట్టుము.

తే గీ. అతని జన్మకుఁ గారణం • బగుచు నీవు
గావె! నీకటాక్షంబున • గాదె యిట్టి
వైభవంబును బొందుచు • వరలుచుండె
దలచు టిట్టిది ధర్మమే • లలితతేజ

(పార్వతినిఁ జూచి) హే! జగజ్జననీ భవన్మహామహిమ నెఱుంగలేక, నీయెడల నకార్యము సేయనెంచిన నాప్రాణేశ్వరుని గాపాడుము. (జలంధరుని సమీపించి) నాథా! ఇదియేమిసాహసము జగజ్జనని యగు సతీదేవినిఁ బట్టసాహసించితివి ఒక్కసారి మహేశ్వరుఁడు కోపదృష్టితోఁ జూచెనేని, లోకములాగునా? చాలుఁ జాలు. సాహసము తొలుత జేసిన సాహసము చాలక, యే దేవాది దేవుని మహితకరుణఁ గాంచఁగోరి మునీంద్రులు పరమనిష్ఠాగరిష్ఠులై తపనము సేయుచుందురో యట్టి భగవంతుఁడగు నీలగళునితో గయ్యముగూడ సేయనెంచితివా! నాకు వైధవ్యదుష్టాలంకారము గూర్పఁదలంచి యిట్టి సాహసోద్యోగమును బూనితివని తలంచెదను. ప్రాణేశ్వరా! ఇంకనైనఁ జేసిన యపరాధమును మన్నింపుమని యీ పురాణదంపతులను బ్రార్థింపుము.

జలం—రమణీ! ఈ సమయంబుననీవిక్కడికేలవచ్చితివి? నాయుద్యమమున కేలభంగము వాటిల్లఁజేసెదవు? రణమున కీవురహాయఁడేగాదు. చతుర్దశభువనములను నొక్క పెట్టున నెత్తివచ్చినను వెనుదీయువాఁడను గాను పొమ్ము.

పర—బృందా! గురుద్రోహియగు నీతనికినాతోఁ గయ్యమొనర్పుట కిచ్ఛజనించినది కాలోలు రానిమ్ము మఱియు కోపాగ్నికింధనమగుఁగాక!

బృంద—ఉపకారభృత్యవ్యాకారమణా! నన్ను జూచిదైన నీవాగ్రహం బును విడువుము పుత్రుడపరాధ మొనర్చిన దండ్రి రక్షింపవల యును గదా! ఈతడేమి నీతో గయ్యమొనర్చుటేమి!

సీ. భక్షింపవే లోక ♦ పరితాపముచు వాప
నాఖిలహాలాహ ♦ లానలంబు
రక్షింపవే యార్త ♦ రక్షాయనుచునీ మ
పదముల సేవించు ♦ భక్తనమితి
శిక్షింపవే సుర ♦ శ్రేణికి సౌఖ్యంబు
నమరఁజేయఁగ ద్రిపు ♦ రాసురులను
వీక్షింపవే శౌర్య ♦ విమర్ధమై భస్మ
మైపోవునట్లుర ♦ మారకుమారు

తే. గీ. నన్ను రక్షింప యింక న ♦ నాధనైన
బ్రతుకజలను గాన నాధర్త చేసి
నట్టి దుష్కార్యమెంచక ♦ యాత్మలోన
భక్తజనమానసోల్లాస ♦ పార్వతీశ.

సతి—(పరమేశ్వరునిఁజూచి) నాథా జలంధరుఁడు నాయెడల దుష్కృత్యము సేయఁదలంచినను, సాధ్వియగు బృందను జూచి యాతనిఁగరుణింపనగు.

పర—[బృందను జూచి] బృందా! నిన్నుఁజూచి నీనాథు రక్షించక దప్ప దయ్యె. (జలంధరునిఁజూచి] జలంధరా! ఇట్టి యవివేక కార్యముల నింక నెన్నడును సేయదలంపక యుండుము. బృందమంగళసూత్రమే నేడు నిన్నుఁ గాచినదని తలంపుము. పొమ్ము.

బృంద—ధన్యురాలనయితిని. పార్వతీ పరమేశ్వరులారా! నిరంతర మును మీ దివ్యనామసేవ నాహృదయంబునఁ గాదుకొని యుండు నట్లనుగ్రహింపుడు.

సతి—సాధ్వీ? పోయిరమ్ము. శుభమగుగాక (పరమేశ్వరునిగాంచి) ప్రాణేశ్వరా! ఇంక మనమరుగుదము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

బృంద—నాథా! నేఁజెప్పిన మాటలు వినక పరమేశ్వరినిఁబట్టఁ దలంచి వచ్చితివి. పరమేశ్వరున కాగ్రహము పూర్తిగా వచ్చినచో నాగతి యేమగును? ప్రాణేశ్వరా! ఇంకను నీచిత్తమునిట్టి యధర్మకార్యము లందుఁ బ్రవేశపెట్టుచు నాకుఁ జింతగూర్పక కరుణింపుము రమ్ము.

జలం—(తనలో) ఆనాఁడు మునిపత్నియగు చారుమతిని భంగము సేయఁదలంచ నడ్డుపడినది. నేఁడీ సతీదేవి విషయము గూడ నట్లే చేసినను. ఇది బ్రదికియున్నంతవఱకు నాయుద్యమము లన్నిఁటికిని భంగమొనవుచునే యుండును. కావున నేనుపాయోపాయమునన్నో దీనినిఁ గడతేర్చవలయును. (ఆలోచించి) సరే! ఇందుకుమంచియుపాయ మీ తోఁచినది ఈపర్వతముపైనున్న చిత్రములఁ జూపుచు, నామూలకుఁ దోడ్కొనిపోయి దీనిపైనుండినముద్రమునఁబడునట్లు ద్రోసివేసెదను (ఇరువురు నిష్క్రమింతురు)

రంగము- (2) కొండలపై జలంధరుఁడు - బృందయుఁ (బ్రవేశము)

బృంద—నాథా! ఆలోచించుచుంటివేమి!

జలం—(తనలో) చిత్తమున నున్న కోపమూవంతయు బయలు పెట్టరాదు. (ప్రకాశముగా) రమణీ!ప్రకృతిసౌందర్యమునకద్భుతమందుచున్నాను- ఇటుఁజూడుము. చితి రత్నమను నిశ్రేణికాశ్రేణి భ్రమదాభ్రతలోత్తుంగశృంగంబు లెట్లున్నవో గంటివా? అక్రింద భాగమీక్షింపుము. ఘుమఘుమ పరిమళించు నితాంతవాసంతికా మల్లికాదివల్లికామతల్లికల నల్లిబిల్లిఁగొని, మదనకదనంబున సదమదంబులగు త్రిదశకిటిపిటపపటలంబున కిపి రత్నంబున బ్రాప్తిం చిన సంకేత సదనంబులనం జనిన పొదలెంత చిత్రముగ నున్నవో

బృంద—నాథా! ఇటుజూడుము తమచక్కదనమునకు విద్యాధరీకాంతల మక్కువ బడజేయుచుఁ అంతన నయుగ సంతతముఁ గాలి పైచి వాసిని మాటిమాటి కక్షీణపక్ష విక్షేపణంబులం నసంచియు

జంటూపుటములఁ బొడిచియుఁ బరువచరణాగ్రంబుల నడచియు కరనఖరంబులఁజీరియు దీటుని కినుకతో వివిధగతులఁజెలంగు బర్హిగణము లెట్లున్నవో !

జలం—సహజ సౌందర్యమున కేవియుసాటిరాదుకదా! ఆవనంబునగల మృగసంతతులపై నొకసారి దృష్టిఁబఱపుము.

సీ. గండభేరుండముల్ ♦ గజేంద్రంతు లిడఁజూచి
సత్వరంబుగ బాఱు ♦ శరభచయము
శరభంబులేగడ ♦ చప్పుడు వినవచ్చి
తరులచాటున డాగు ♦ హరిగణంబు
హరిగణధ్వానంబు ♦ నాలించి నిశ్చేష్ట
త వహించి నిలచు మ ♦ త్తగజసమితి
మత్తజగంబుల ♦ మార్గంబు వీక్షించి
శీఘ్రంబుగా బాఱు ♦ చిరుత గండ్లు
తే. గీ. చిఱుతగండుల చప్పుడు ♦ చెవికిఁదగిలి
చెంగు చెంగునదాటు ♦ కురంగతతులు
గలిగి మిగుల చిత్రంబుగా ♦ జెలఁగుచున్న
నమ్మహావనిఁగంటె వా ♦ యబ్జనేత్రి !

ఇంకను మనమూమూలనుండి చూచినచో మఱింతచక్కగగాపించును. రమ్ము (ఇంచుక నడచుచున్నారు)

బృంద—(క్రిందకుఁజూచి) ఈ పర్వతాగ్రముననుండి సముద్రమునకై చూచినచోఁ గన్నులు తిరుగుచున్నట్లుండును.

జలం—తరుణీ! ప్రభాకరబింబము జలములయందెట్లు ప్రతిఫలించుచున్నదో చూచితివా ?

బృంద—(సముద్రమునుఁ జూచుచుండును)

జలం—(తనలో) ఇదియే సమ యము.

(బృందను సముద్రమునఁ బడునట్లు ద్రోయును.)

బృంద—హా! (అనుచు సముద్రమునఁ బడుచున్నది)

జలం—నేఁదలఁచిన పనియైనది. (నిష్క్రమించును.)

(తెర లేచును)

సముద్రము:—(బృంద జలములలో నటునటు గొట్టుకొనుచు నుండఁగా విష్ణుమూర్తి - ప్రవేశించును.)

బృంద— (జలములందుండి) నారాయణ! నారాయణ!

విష్ణు—(జలమునందున్న బృందనుజూచి తనలో) అక్కటా! దురాత్ముండగు జలంధరుఁడీ బృందయెడల నెట్టి దుష్కృత్యమొనర్చినాఁడు! నే నిప్పుడీమెను రక్షించెదగాక. (జలములలోదిగి) సాధ్వీమణీ! భయమందకుము, ఆర్తత్రాణుఁడనైన నేను నిన్ను రక్షించుచున్నాను. (బృందను దీసికొని యొడ్డునకు వచ్చును.)

బృంద—(విష్ణుమూర్తినిఁజూచి) శాశ్వతసౌఖ్యమునజనుటకై విధిప్రేరణమునని౦దుఁబడిన నన్ను రక్షించితివేల? మహాత్మా! కరుణామయుండవైన నీ వెవ్వడవో యెఱుంగవచ్చునా!

విష్ణు—బృందా! ఇంతలోనే మఱుపా!

తే. గీ. ఏను నీ హృదయంబున ♦ నెపుడు నర్త
నమ్ము సల్పుచు నుందున ♦ జమ్ము తేప
నఖిల భక్తుల హృదయంబు ♦ లంచునుందు
నన్నుఁ దెలియఁగఁగంటివె నీవు ♦ నాతిమిన్న.

బృంద—[తనలో) ఓహో! ఈతఁడు శ్రీమన్నారాయణమూర్తి ఒకనాఁ డీ యా మహానుభావుఁడు త్రిజగత్కల్యాణదమగుదర్శనము నాకొసంగి, మదీయగుణపరీక్షార్థమై నన్ను మోహించినట్లు నటించి

నాడు. భగవంతుడు భక్తజనమానసంబుల ననేక విధంబులఁ బరీక్షించుచుండునుగదా! (ప్రకాశముగా) ఆర్తరక్షామణీ! భవదీయ దివ్యమంగళవిగ్రహ మొకసారి దర్శించియుండియు, నేదజ్ఞానంబున బడి కనుగొనలేకపోయితిని. మన్నింపుము.

మ॥ కలనైనన్ సులభంబుగాదు భవదా • కారంబు దర్శింప, నా
నలినప్రోద్భవ ముఖ్య దేవతలకై • నన్ నేడు మల్లోచనో
త్పలముల్ ధన్యతగాంచిమించగ భవ • త్పదాబ్జయుతాస్యందుమం
డలి వీక్షించితిఁ గ్రిమ్మరన్ విమలవు • ణ్యంబెట్టిదో మాధవా.

సముద్రమునఁ బడిన నేను ప్రాణముల బాసియుంటినేని నీ సాన్నిధ్యమునఁ జేరియుండునుగదా! నన్నేల రక్షించితివి?

విష్ణు—భక్తరక్షణము నాయుద్యోగమేకదా! (తనలో) ఈమె జలంబునఁ బడుటకు గారణమడిగిన నేమనిచెప్పునో? (ప్రకాశముగా) నారీమణీ! నీవీ జలగాహింబడుటకుఁ గారణమేమి?

బృంద—భగవంతా! నా పురాకృత ప్రారబ్ధమని చెప్పుటకంటె వేఱేమియుఁ జెప్పఁజాలను

విష్ణు—పతి నిరాకరణమే కారణమని యూహించెదను.

బృంద—(మాటలాడక యూరకుండును.)

విష్ణు—నిరుత్తర మంగీకార సూచకమా!

బృంద—దేవా! ఇప్పుడీ యనవసరమైన సంగతియేల?

విష్ణు—బృందా! నీభర్తచేసిన యకృత్యము నీవు చెప్పక దాచినచో నాకుఁ దెలియదనుకొంటివా?

బృంద—సకలాంతర్యామి వగు నీకుఁ దెలియని విషయమేమున్నది!

విష్ణు—నీయుండట్టి నిరాకరణభావము వహించిన పతినిఁ బట్టుకొని యేల ప్రాకులాడెదవు? జగన్మోహనసుందరవగు నా యభీష్టము దీర్చి శుభంబుల బడయుతలంపవే?

బృంద—లోకేశ్వరా! నాహృదయ మిదియని నీకుఁ దెలిసియున్నది ఇంకను నన్నేల పరీక్షించుచుండెదవు

ఉ. దేవుఁడవైనఁగాని మఱి • దేవరి యబ్బవు నైనఁగాని నా
భావ మధర్మమార్గమున • వర్తిలనెంచదు వేయుమాటలేల నీ
వీఁధిఁ బెక్కుభంగులను • నేఁ బరికింపఁగఁ జేయవచ్చు ల
క్ష్మీపతి భర్తృసేవ నతి • నే సకలార్థము లిచ్చుగాదొకో

విష్ణు—పోనిమ్ము ప్రాణదానము చేసినందులకు నాకేమి యుపకారము సేయుదువు

బృంద—మహాత్మా ఉత్తమపురుషు లెప్పుడును నుపకార మొనర్చి ప్రత్యుపకారమును గోరరు భువనాధీశ్వరుండ వగు నీకు నేను ప్రత్యుపకారము సేయఁజాలినదాననా? నీపాదారవింద సేవపై నిరంతరము నాచిత్తము దగిలియుండునట్లు మాత్రమనుగ్రహింపుము

విష్ణు—అట్టయిన నీవిప్పుడు నాయాజ్ఞలనుసరింపుము.

బృంద—అధర్మముగాని దెట్టికార్యమునైనఁ జేసెదను

విష్ణు—నీవిప్పుడా బృందావనంబున నుండుము నీనాధుడు తనంతతాను నీకడకు రాగలడు

బృంద—పతి పదసేవ చిత్తమునందుఁ జేసికొనుచు భగవదాజ్ఞ ననుసరించెదగాక!

(నిష్క్రమింతురు)

రంగము—(3) వైకుంఠము విష్ణుమందిరము ముందు...

ఇంద్రుడు గాలవుడు - ప్రవేశము.

ఇంద్రు—మునీంద్రా! గాలవా! జలంధరుడు సేయు దుష్కృతములు నానాటికి హెచ్చుచున్నవిగాని తగ్గుటలేదు. ఇంక నెన్నాళ్లోర్పికఁ బట్టగలము.

గాల—అతని దుష్కృత్యములన్నియు శ్రీమన్నారాయణుఁడు చూచు చుండియు నిట్లు శాంతి వహించియుండుటకుఁ గారణ మూహింప జాలకయున్నాను.

ఇందు—తాపసోత్తమా! అడుగనిదే యమ్మన్నయైనను బెట్ట దను సామెత నెఱుంగవా! (ఇంచుక యూరకుండి) ఇప్పుడు దానిం గూర్చి యోచింపనేల భగవంతుడగు శ్రీహరికి జలంధరునిఁగూర్చి విన్నవింతము. కరుణాసముద్రుండగు నాతండెట్లు చేసినను సరే.

గాల—(ఎదుటఁజూచి) భగవంతుఁడు మందిరమున లేడాయేమి అయి ననునిట్లు పిలచి చూచెదగాక!

(ఎదుట జూచుచు)

సీ మామొరాలింపవు ♦ మహనీయ వటపత్ర
సీమపై నిద్రకు ♦ జేరినావా
కరుణఁజూపింపవు ♦ కమలాలయాదేవి
నెడబాయ జాలక నెనఁగినావా
కాపాడ నెంచవు ♦ నీపదంబులభక్తి
జింతించు వారికి ♦ జిక్కినావా
రక్షింపఁజూడవే ♦ రాక్షసాధమునైన
నాలమున నన్ గూల్ప ♦ నరిగినావా

తే. గీ. కాకయుండిన నారీతి ♦ గలవ దిత్తుఁ
డై జలంధరుఁ డొనరించు ♦ నట్టి క్రూర
కార్యముల గాంచుచుండియు ♦ గాననట్లు
పైదియుంటివి యిదియేమి ♦ జలరుహాక్ష

ఇందు—అదుగో శ్రీమన్నారాయణుఁడు. మనకుదర్శన మొసంగుట కిట్లువచ్చుచున్నాడు.

విష్ణుమూర్తి - ప్రవేశించును.

ఇందు—(విష్ణుమూర్తినిఁజూచి) లక్ష్మీకళత్రా! వందనము లర్పించు చున్నాను.

విష్ణు—మహేంద్రునకు శుభమగుఁగాక, (గాలవునిఁ జూచి) మునీంద్రా! వందనములు ఇంచుకయూరకుండి మహేంద్రా! [గాలవునిఁగాంచి తాపసోత్తమా! ఈ యాసనము లధిష్ఠింపుడు

(ఇద్దఱును నాసీను లగుదురు.)

విష్ణు—అమరలోక విభుండగు నీవును తాపసోత్తములగు నీగాల వుండును నేదితరా రొక్కవిభుకార్యమునకై యేతెంచిరని తలంచెదను. నేమి మీరామొదలఁ జేయవలసిన కారణమెద్ది?

గాల—ఇందిరారమణా! సర్వము నెఱింగియుండియు మాచే విననోరి యుడిగెదవు? జలంధరు దుష్కృత్యములలో నీవెఱుంగని వేము న్నవి?

సీ. అలింపవదియేల ♦ యాశ్రమంబులఁజొచ్చి
సంయమీంద్రులఁబెట్టు ♦ శ్రమల నెల్ల
అరయకుంటివదేల ♦ యజ్ఞవాటిక లెల్ల
నేలమట్టముఁజేయు ♦ నీచగుణము
జాలిబూనవదేల ♦ సాహసంబుపలోక
షులనేచు దుర్మార్గ ♦ ముఁదిలకించి
చెవిఁజేర్పవదియేల ♦ శ్రీహరి యనివేడు,
తాపస సతుల యా ♦ ర్తారవంబు

తే. గీ. అన్నియును జూచుచుండియు ♦ మిన్నకుంటి
వేల? ఆజలంధరుఁ దున్మ ♦ వేల? నీవు
గాక మాకు లోకముల ర ♦ క్షకుఁ డెవండు?
శ్రితజనావనశీల! ల ♦ క్ష్మీకళత్ర!

నారదుఁడు...(ప్రవేశించి విష్ణుమూర్తినిఁ జూచి నిజము నిజము! జలంధరుని దుష్కృత్యము లపారముగ నున్నవి.

తే. గీ. తనకుఁ దల్లియైనదియైనఁ ♦ దలఁపకుండ
శంభురాణిఁ బట్టంగ ♦ సాహసించి

యిట్టి కార్యంబు చేసిన ♦ హీనునకును
వరమునీంద్రుల పత్నులే ♦ పాటిగారు
గొప్పదైనాడల లోఁగొనఁ ♦ గొట్టుమిాను
వకుఁ గలప తెప్ప లరయ జం ♦ తికలు గావె

ఇంద్రు—నారాయణ! ఆజలంధరుఁడు తాపసాశ్రమము లందుఁ బ్రవేశించి చేయుచున్న దుష్కృత్యముల వచింప నలవి కాదు. ఈమధ్య తన దుండగములమరలోకము పైనఁగూడ బ్రారంభించినాడు. అమర కాంతలనుగూడ బంధింప మొదలిడినాడు. ఒక్కఁడయ్యును సంగరమునకు వెనుదీయఁడు. పరాజితుఁడుగాఁడు.

గాల—తాపసాశ్రమముల బ్రవేశించి మునిపత్నుల బల్మిని గొనిపోవు తరిని మునుల కలకవాదము బృందసాధ్వీత్వమునకు భయమంది శపియింపఁజాలకయున్నారు. ఇంతకు మును సాధ్వియగు బృంద యూతనికడ నున్నప్పుడు శక్తియున్నంత వఱకెట్టి యకార్యములు జరుగకుండఁ జేయుచుండెను. ఇప్పు డాసాధ్వి దుర్మార్గుడగు జలంధరునిచే సముద్రమునఁ ద్రోయంబడి, నీచే రక్షింపఁబడి బృందావనమునుండి నీయందేఁ జిత్తముఁ జేర్చి, కూర్చుండినను దనపతి కెవ్వరివలనను హాని కలుగకుండును గాక యని నిరంతర మహావ్రతయై యున్నది.

ఇంద్రు—భగవంతా? ఇంక నీవా జలంధరుని విషయమై ప్రయత్నించక పోయిన సాధ్వీమణుల మానరక్షణమునకు మార్గము లేకయుండును.

విష్ణు—మహేంద్రా! జలంధరుని దుష్కృత్యము లన్నియు నే నెరయుచు నేయుంటిని. బృంద మహాసాధ్వి. ఆమె సాధ్వీత్వమున కొకింతయేని భంగము గలుగనిచో జలంధరుఁ డేనియుఁ బొందఁడు.

ఇంద్రు—దేవా! సకలామరమునిజనార్థమై యీపీ కార్యభరమును బూనవలెను.

విష్ణు—(తనలో) ఇదియు నొకమేలే (ప్రకాశముగా) లోకహితార్థమై యీకార్యంబునకుఁ గడంగెదనుగాక! (నరదునిఁ జూచి) నారదా!

## చతుర్థాంకము :

ఈ విషయమున నీవుగూడ నాకుఁ గొంత సహాయము సేయవలసి యున్నది.

నార—భగవదాజ్ఞ శిరమున దాల్తునుగదా?

విష్ణు—నీవరిగి జలంధరుని బరమేశ్వరునిపై యుద్ధమున కరుగఁ ప్రేరేపింపుము.

ఇంద్రు—ఇట్టి కార్యము లన్న నీ మహాత్మునకు సంతోషమే కదా ! (ఇంచుక యూరకుండి) దేవా ! ఇఁక మా కాజ్ఞనిమ్ము.

విష్ణు—శుభమగుగాక !

(గాలవుడు - ఇంద్రుఁడు - నారదుడు - నిష్క్రమింతురు)

విష్ణు—(తనలో) నేను జలంధరుని వేషముతోడ బృందను జేరి వంచించ వలయును. (ఆలోచించి) కానిమ్ము తుదకీయుద్యోగ మెట్లు పరిణమించునో చూచెద.

(నిష్క్రమించును)

ఇది చతుర్థాంకము.





# సతీతులసి.

## పంచమాంకము.

రంగము—(బృందావనమున బృంద విచారముతోఁ బ్రవేశము)

బృంద—(తనలో) అహా! విచారాక్రాంతచిత్తులకు నిద్రరాదుగదా అకటా! నాస్థితి కేమని వగతును? నాకిట్టి గతి సంభవించునని కలనైనఁ దలంచియుంటినే! నాప్రాణేశ్వరునకు సన్మార్గము నవలంబింపుమని చెప్పుటచేత నేనెంత విరోధినయితిని. లోకమాతయగు పార్వతిని బట్టుటకు సాహసించి, రుద్రుని కోపజ్వాలల కాహుతి యగుటకు సంసిద్ధుఁడై యున్న యాతనిని రక్షించినందులకుఁ బ్రత్యుపకారముగ నన్ను జలరాశిం బడద్రోచెనుగదా! జలంధరు నుద్దేశించి హానాధా!

సీ॥ పరకాంతగూడుట ♦ పాపమంచును దెల్పి,
తినిగాని మతియేమి ♦ తెలుపలేదు
మునిపత్నులనుగాంచి ♦ మోహమందుట గూడ
దంటిని నింకేమి ♦ యనఁగలేదు
వరమునీంద్రులఁగాంచి ♦ పరిహాస మొనరింప,
వలదంటి నొండేమి ♦ పలుకలేదు
భవదీయ పదసేవ ♦ వాంఛించితి నటంచు,
వేడితి మతియొద్ది ♦ వేడలేదు

తే॥ గీ॥ కటకటా నీకునై యింత ♦ కష్టపడెదు
సాధ్వినగు నాకు నీగతి ♦ స్వాంతమందు
దుఃఖమును గూర్చుటేగాక ♦ తోయరాసి
ద్రోచినాడ వేమందు నీ ♦ దుష్కృతికిని.

ఆనాడు జలరాశియందు నీవు నన్ను ద్రోసినప్పుడు భగవంతుండగు శ్రీమన్నారాయణుఁడు నన్ను రక్షించియుండనిచో నాకీచారమే యుండదు. ఆమహాత్ముఁడు నన్నెల్ల రక్షించెనా యని చింతించుచుంటిని. నాథా! మొన్న నారదుఁడు నాకడకరుదెంచి నీవొనర్చుచున్న దుష్కృత్యములఁ గూర్చి చెప్పిన విని నేనెంతయు విచారించితిని. నేనేమి సేయుదును! ఇంక దేవతలందఱును నీపై నలిగి యేమి సేయుదురో కదా! నీవు నన్నుఁ జంపినను రక్షించినను నీవే నాకు గతియని తలంచి మొన్న నారదుం డక్కడనుండి నీవమరలోకమునకరిగి యుంటివని చెప్పి నీకడకు రానున్న నన్ను వారించెను. ప్రాణేశ్వరా నీవు సన్మార్గవర్తనుఁడవై నీపదసేవ నాకీజన్మంబున నొసంగుదువా ఆభాగ్యము నేను నోచుకొనియుంటినా? (ఇంచుక యూరకుండి) నన్నుఁ జంపఁదలంచిన నీవు నన్నుఁ గరుణింతువా? నీచే నిరాకరింపఁ బడిన నేనెన్నాళ్ళింక యిట్లు బ్రదుకుదును? కాని, జీవించి యున్నంతవఱకు నాహృదయమున నీసేవయు, నిష్కళంకతయు మఱువకుండ నున్నంతవఱకు నీ కేవిధమయిన హానియు నెవరివలనను గలుగకుండుగాక! (దిక్కులఁ జూచి) ఇంక నెప్పటికి దెల్లవారునో కదా! (ఆకాశమువంక జూచి)

మ. తనచేఁ బోషణ సేయఁగాబడెడు ప ♦ ద్మశ్రేణిబాధింతు, నీ
వని? భావించెదె వచ్చె నీపయికి నెం ♦ తైనం జనంజెల్లు నీ
కని, ప్రేమంబును బూని వార్తజలజా ♦ తారాతికిన్ దెల్పవ
చ్చినచందంబున వేగుచుక్కయుదయిం ♦ చెన్ బూర్వభాగంబునన్.

(ఇటునటుఁ జూచి కోడికూత వినుట నటించి)

మ. ధరణిన్ జాడదిరి కాలబోధమున కా ♦ ధారంబు మత్కంఠ సు
స్వరమే యౌనుగదా మదుచ్చరిత శ ♦ బ్దం బల్పమేయంచు దు
ర్భరగర్వం బెఱిగించుభంగి బ్రియమా ♦ రన్ గుక్కుటశ్రేణి భా
స్వరలీలన్ వడిఁ గూయసాగు నదె వి ♦ శ్వగ్రామధామంబులన్.

(ఆకాశము వంకజూచి) అదిగో తమ్మిచెలి యుదయాచలేంద్ర

వల్మీకముమీద బ్రత్యూషపర్వ సమయంబు విడిచిపోయిన నిర్మో
హామనుసట్లు తూర్పుదిక్కున శాంతిమద్యుతి జనించినది. ఇంక నేను
సూర్యోదయము గాకపూర్వమే కాలకృత్యముల నిర్వర్తించుకొని
స్నానముఁజేసి భగవదారాధనయందు జిత్తమును ప్రవేశపెట్టెదను
గాక (నిష్క్రమించును)

విష్ణుమూర్తి జలంధర రూపముతోఁ బ్రవేశించును.

విష్ణు—(తనలో) నారదుని ప్రేరేపణమున జలంధరుడు శివునితో యుద్ధమున కరిగినాడు. ఇప్పుడు వారియుభయులకును పోరు ఘోరమై యుండును, (ఆలోచించి) ఇంక నేనాలోచించనేల ? ఈవేషముతో బృంద జేరెదగాక! తనభర్త దుర్మార్గుడయునను నాతని పద చింతనము హృదయమునందు విడువక నిరంతరము నాతని క్షేమమునే గోరు పరమసాధ్విని నెట్లు వంచింపగలనో తెలియరాదు.
(ఎదుటజూచి) అదిగో బృంద

తే. గీ. జాగరారుణలోచనా ♦ బ్జములతోడ
దంతపదశోభితామలా ♦ ధరములతోడ
పిక్కదులంటెడు మేలైన ♦ కురులతోడ
నలుగుబ్రుంగ మోమును జూడ ♦ హర్షమొదవె.

ఈమె యిప్పుడే స్నానమాచరించి భగవదారాధనయందుఁ జిత్తముజేర్పుటకు దలంచుచు సూర్యోదయమునకు గాచుకొని యెదురుచూచుచున్నది (పరికించి) ఆమె యిట్లేవచ్చుచున్నది. నేను నెమ్మదిగా నెదుటబడి నాయుద్యోగమున వర్తించెద. ఆహా

తే. గీ. అఖిలలోకాధినాథుఁడ ♦ నైన నేను
యొక్క యువిదపై సమ్మోహ ♦ మూనుటిట్లు
దేవహితమను వంకపై ♦ దెలివిమాలి
పచ్చితిని సీతలోదరికి ♦ వంచనంబు
నేడు జనము లీకార్యమీ ♦ క్షించినన్ను

గైరికాన యుండ్రి యాదగ్ర • కంబుగాఁగ
కంచయే చేను మేసిన • గలదె దిక్కు.

(బృంద - ప్రవేశించును)

బృంద—(ఆకాశమువంకఁ జూచుచు)

సీ. ఉరుమహోదయధరో • త్సవుఁడు ధరించెడి,
మహనీయకోటీర • మణి యనంగ
బలభిత్కుమారుని • పాన్పుపై గట్టిన,
కెంపైన పవడంపు • బంతియనగ
బ్రత్యూషతరుణి, శ్రీ • రమణకై యెత్తిన
దివ్యనీరాజన • దీపమనగ
దొలిదిక్కు పూఁబోఁడి • యలికభాగమునందు,
దీపించు కాశ్మీర • తిలకమనగ
తే. గీ. నవ్యతరుణారుణ కాంతులు • భాసిలంగ
సకలజగముల నానంద • జలధి ముంచ
నాత్మలోపల భావించి • యా పయోజ
మిత్రుఁడల్లదె పూర్వాద్రి • మీఁదఁ దోఁచె

(ఇటునటు జూచి) ఆహా! ఏమి? ఈ పులుగులయొక్క విచిత్రగతులు

సీ. తేమావిచిగురుకు • లేను నోటనుబెట్టి
ముదమున దా దిను • భూరిపికము
జంట బాయఁగలేక • సంతసమ్మున నంత
మధువు నానె[illegible] • ట్పదమిధునము
మాటిమాటికి దన • బోటినిఁ బిల్చుచు
నింపు హర్షమునఁ జ • రించు శుకము
విడచిన నేహాని • యెడకనో యని మోద
మొదఁగలిపికిఁగోకి జ • క్కవలజోడు
తే. గీ. ప్రకృతి విభవ నుంచిన జీవరాసు లెల్ల
కలిత దాంపత్యసౌఖ్యంబు • గాంచుచుండ

నాపురాకృతకర్మము • నకు మనంబు
నందు నేమని వగతు ని న్నెంతి నేను.

విష్ణు—(తనలో) ఇదియే మంచి సమయము. (తొందరగా బృందను సమీపించి)

మ॥ తరుణీ! నీయెడ నేను జేయు నపరా • ధం బెల్ల మన్నించి, స
త్కరుణావశ్యము నాపయిం గురిసి, నీ • కౌగింటిలోఁ జేర్చినా
వెరపుల్ మాన్పుము; బుద్ధివచ్చెను సుమీ • విజ్ఞాన మబ్బెన్నిరం
తరముల్ శీర్షమునందు దాల్చెద భవ • ద్వాక్యంబులన్ సుందరీ!

చ॥ గతజల సేతుబంధమున • గైతిలపోయుట పాడిగాదు; దు
ర్మతినయి నేను నీ బలుతె • యుంగుల బాధలు పెట్టినాడ; నీ
మతి నవియెల్ల బోవిడిచి • మానిత సత్కృపనాదరించి; యం
చితగతి నేలుకొమ్ము నర • నీరజపత్రవిశాలలోచనా!

బృంద—(తనలో సంతోషముతో) ఆహా! నేడెంతయు సుదినము. భగవదనుగ్రహమున నా నాథునకు నాయెడ గరుణ జనించినది ఇంతకు తానొనర్చిన దుష్కృత్యములకుఁ బశ్చాత్తాప మందుచున్నాడు ఇతని పాదసేవ నాకు లభించుటంజేసి నేను కృతార్థురాలను: (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! ఎన్నాళ్ళకు నాయందు దయవచ్చినది నన్నుఁ గరుణించుటకు నేనెంతదానను!

శా॥ రాకాచంద్రునిరాకకున్ నిశిచకో • రంబట్లు చండాంశుశో
భాకారంబునకున్ సరోజమటులే • యత్యాసతో నెప్డు నీ
రాకల్ గోరుచు నున్నదాన నిట నన్ రక్షింపభావించి యా
హా! కారుణ్యము బూని వచ్చితివి ధన్యంబయ్యె జన్మంబిలన్

నాథా! ఇప్పటికైన నా యందు గరుణగలిగినది. నీవుఁ నాయందు నిష్కారుణ్యవహించి నీపదసేవను దూరముగఁ జేసినఁ నేను నీపాదసేవ మరచియుండలేదు. నా యెడల నీవు గినుకవహించి ఇలరాశంద్రోయ శ్రీమన్నారాయణునియనుగ్రహమున బ్రదికితిని

లేకున్న నేనీపాటికి స్వర్గసౌఖ్యము ననుభవించుచునే యుందును. ఇంతకును నీచరణంబుల గొలిచి కృతార్థురాలనగుటకు గాబోలు బ్రతికియుంటిని.

విష్ణు—(తనలో) ఈమె నన్ను జలంధరునిగనే భావించినది. ఇంతవఱకును నాప్రయత్న మనుకూలముగనేయున్నది. (ప్రకాశముగా)

ఉ. నీవు మహాపతివ్రతవు ♦ నిర్మలధర్మవివేకశీల స
ద్భావము నీదుసొమ్ము; జన ♦ వంద్యను నిన్నును నేనెరుఁగ్గ దు
ర్భావముఁబూని హింసలకు ♦ బాలొనరించితి; వానిసైగి; మో
దావహచిత్తమూని చరి ♦ తార్థునిజేయుము సుందరీమణీ.

బృంద—మనోహరా! నేను నీకగుణకు బాత్రురాలఁ నేగాని విరక్తికిఁ గానుఁ గడచినదానికి నీవుగాని నేనుగాని చింతించినందువలనఁ బ్రయోజనము లేదు. ఇక మనము సంగతి మరచిపోవలయును.

విష్ణు—
మ. జలజాక్షీ! భవదీయవాక్యములనే ♦ స్వాతంబునం దెంచకే
పలుభంగుల్ నినుహింసఁబెట్టితి బరా ♦ జ్ఞాతాత్ములం బట్టితిన్
గలితోగ్రపరిధనంబులన్ విబుధులన్ ♦ గారించితిన్; దాపసా
వళి బాధించితి వారెసన్నిధిఁ గటా ♦ బంధించి తత్పత్నులన్,
ఇదియంతయు నట్లుండ, ముక్కంటిచే భస్మముగాకుండ నన్ను రక్షించిన మహాసాధ్వీశిరోమణివగు నిన్ను నముద్రమునఁ గూలద్రైచితిని. ఈపాపములన్నియు నన్నేవిధమునఁ గట్టి కుడుపునోకదా! (విచారమునటించును.)

బృంద—మనోహరా! పాపముఁజేసి పశ్చాత్తాపమునొందిన వారా పాపము ననుభవించరని యోగ్యులు చెప్పెదరు.

విష్ణు—భయాకలితకుఁ త్తుండవగు నన్ను నీభుజపంజరమున జిక్కించుకొని విటపువూన్పుము. (కౌగలించుకొనుచున్నాఁడు.)

బృంద—జీవితేశ్వరా! గలిగించిననంగసుఖముల దలంచుకొని సొలసితా
తిరంచిపత్రి?

తే. గీ. నీపరిష్వంగసౌఖ్యంబు • నిక్కముగను
వర్ణనము సేయఁ గవికైన • వశముగాద
టంచు, బలుగంగ వగఁగాదె • యట్టిమొదల
పదము లుండుటె నాకుఁ • బద్మనయన.

(జలంధరుని శిరము వాతిముందుఁ బడును.)

బృంద—[తొందరగా విష్ణుమూర్తిచేయి విడిపించుకొని జలంధరుని
శిరముఁ జూచి) హా! ఇదియేమి? (మూర్ఛిల్లును)

(విష్ణుమూర్తి నిజరూపము ధరించి నిలుచును.)

విష్ణు—(తనలో) ఈవ్యాపారము తుద క్షేమగునో కదా.

బృంద—(విష్ణుమూర్తిని జూచి) హా కపటనాటక మాత్రధారీ! ఎంత
మోసము చేసితివి! (భర్తశిరమును బట్టుకొని) హా! ప్రాణేశ్వరా!
నీవీప్రపంచమును విడిచిపోయితివా?

ఉ. అయ్యయొ జీవితేశ, యిటు • లైతివె యిందుల కేమి సేతు, నా
కయ్యది యింకదిక్కు మఱి • యెవ్వరి వేడుదు రక్తసిక్తమై
యియ్యెడ నీశిరం బకట • యీదశ బొందఁగ గాంచియుండియున్
వ్రయ్యలుగాకయుంటి లల • నల్ కఠినాత్మలు గారె యారయన్

హా మనోహరా! నాయెడల నీవు నిష్కరుణవహించి నన్ను బాసి
నను, నీపదసేవయె చేయుచు, నాసుమంగలత కేవిధమగు భంగము
గాదుకదా యని తలంచితిని. వంచకుడైన హరి భవదీయాకృతిఁ
దాల్చి వచ్చుట నెఱుంగక నీవేయని భావించి నీపదదాస్యము
లభించెఁగదాయని యెంతయో సంతోషించితిని. అక్కటా!
నీకట్టి దుర్దశ గలిగించిన దెవ్వరో కదా!

విష్ణు—రణమున ముక్కంటిని దాకటచే నీగతి బొందెను

బృంద—(భర్తనుద్దేశించి) జీవితేశ్వరా! ఇంక నేనెంత విచారించిననేమి ప్రయోజనము?

సీ. ఐశ్వర్యమిచ్చిన • హరుడాది దేవతల్
భవదీయ చరణసే • వకు లటంచు
నీ యకృత్యములకు • నిత్యంబు భయమందు
తాపసేంద్రులు పాలి • కాపులంచు
సాధ్వీశిరోమణుల్ • సంతుమిగాంప్రిల పడం
తులు వెలవతులతో • దుల్యులంచు
భారతీపాదభక్తి • పాలబ్ధ విక్రమ,
శౌర్యబలములు శా • శ్వత మటంచు

తే. గీ గర్వమును బూని యట్లు లో • కములయందు
మిన్ను మన్ను నెఱుంగక • మేనుమఱచి
తిరిగినందుకు, పాపమా • కరణి నిన్ను
గట్టి కుడిపెను తప్పనే • కర్మఫలము.

సీ, నిరతంబు దేవతల్ • నిఖిలమానవులకు
బూజార్హులను బుద్ధి • బూనలేక
యెచట ధర్మంబుండు • నచటనే జయముండు
ననెడి వాక్యంబును • నరయలేక
తాపసోత్తముల నం • తాపింపజేయుట
యే నాశనం బని • యెంచలేక
సాధ్వీమణి కీర • స్కారమే వంశంబు
గడతేర్చననుమాట • గాంచలేక

తే. గీ. గర్వమున జరించినందుకు • గలుమ యిట్లు
బండి కారణంబయ్యె భవ • స్మృతికిని
నింక నేమని వగతును • నేవి దిక్కు
నీవు లేనట్టి యీ బ్రదు • కేల నాకు

సీ. పరసతీ సంగమ ♦ వాంఛయొక్కటి చాలు,
సత్కులంబెల్ల ధ్వం ♦ సంబు సేయ
సంయమీశ్వరతిర ♦ స్కార మొక్కటి చాలు,
సకలభాగ్యముల నా ♦ శనము సేయ
సాధుజనసమితి ♦ సంతాప మొక్కటిచాలు,
కలితపుణ్యము లడు ♦ గంటఁజేయ
దేవదూషణ దుః ♦ ఖేళ మొక్కటిచాలు,
నిమిషంబు లోపల ♦ నీరు సేయ
తే. గీ. నక్కటా యివియన్ని నీ ♦ యందు నమరి
యుండుటం జేసి యిట్టిచే ♦ టొంద నయ్యె
వగచి నందున కేమిలా ♦ భంబుగలుగు
కర్మఫల మిట్లు నిన్నునుఁ ♦ గట్టికుడిపె.

పాణేశ్వరా! నేనింక శోకముమాని ధైర్యచిత్తనై నిన్ననుస రించి కృతార్థురాల నయ్యెదగాక! (విష్ణుమూర్తినిఁజూచి) శ్రీహరి నీవు నన్నిట్లు వంచించెదవని కలనైన దలంచి యుండలేదు. నా చిత్తవృత్తి నెఱింగి యుండియు నిట్టి యకార్యమున కేల యుద్యో గించితివి? ఇదియా నీ ధర్మరక్షణము!

ఉ॥ అనిశము దీనసంతతిని ♦ నారసి వారల శోకెఁదీర్చుచుఁ
మనుచుటొ; దుష్టదైత్యుల ర ♦ ణంబున శౌర్యమునన్ వధించుచుఁ
ఘనమతి దేవతాతతినిఁ ♦ గాచుటొ; యక్కట యిట్లుసాధ్వినై
న నన్ఁ గుయుక్తి మానహర ♦ ణం బొనరింపగ నెంచుటో హరీ.

దీనివలన శ్రీహరి- పరాంగనాహరణమాననుఁ డని వచ్చునింద కన్న, మఱియొక లాభ మేమి యుందఁ దలంచితివి?

విష్ణు—నారీమణీ! నిఖిలజగజ్జేగీయమానంబగు భవదీయ సౌందర్యము నకుఁ జిక్కి- తి నను సంగతి నీవెఱింగి యుంటివి. అది యట్లుండుము ప్రస్తుత మీకార్యము నిఖిలామరమునిజనార్థమై నాచేఁ చేయఁ బడినది, తాపసపత్నుల బలిమింబట్టుచు, దాపసులకు సంతాపము

గలుగఁజేయుచుఁ దేవతలకుఁగూడ బాధగలిగించుచున్న నీ నాథుఁడింతవరకును నీ సాధ్వీత్వమువలన నేకీడును బొందకయున్నవాఁడు.

తే. గీ. ధావ? నీ మది నొక్కింత • చంచలతను
గలుగఁజేసితినేని ము • క్కంటివలన
నాలమున నీదు నాథుండు • గూలుననుచు
నిట్టిమాయఁ బన్నితి దేవ • హితముకొరకు
గినుక నొందకు నాపైన • గీర్వాణి

జగద్ధితార్థమై నేనొనర్చిన యీకార్యము నిందస్యము గాకయుండుగాక సాధ్విమణీ వశు నీయశమున కొవంతయుఁ గళంకముండకుండుగాక! నాకు నీయందుఁ బ్రీతియుండుటంజేసి నీవఖిలలోకంబుచేఁ బూజింపఁబడెదవుగాక?

బృంద—మాధవా! పరాంగనల వంచించుటయేనా నీవు దేవహితముకొఱకు నేయుకార్యము! ఇదియేనా! నీధర్మసంధత! ఇదియేనా నీ భక్తరక్షణము! నాభర్తృమృతికేదుఃఖంతువా? నీవొనర్చిన యకార్యమునకే వగతువా? ఎట్టి దుష్కార్యముజేయుటకు సాహసించితివి సాధ్వియనియొక్కింతయైనదలంపవైతివికదా; దేవహితార్థమైపరాంగనలమానభంగమొనరింప దలంతువుగా! ఆహా! ఏమి! నీభువనపరిపాలన దక్షత! నీకీ యాధిపత్యములభించుట యంధ్వంబులందుండు కర్దమునకు పటీరాదిద్రివాసము లభించునట్లును, బాషాణముల మ్రింగుపారావతమునకు రత్నరాశి లభించినచందమునను, గ్రామతటాకాంతరంబున వర్తించు కొంగకు మానసనరోవర విహారము మరిన మాడ్కి, ముఱుఁగుడు బొందులఁదినుజంబుకంబునకుమత్తసామజము తలమెదడు జేకూరినకరణిని నున్నది. (కోపముతో) సాధ్వినగు నాయెడల నట్టి యకార్యమాచరించి, మదీయాగ్రహంబునకుఁ బాత్రుండవైతివి. జాజ్వల్యమానదావజ్వాల లశ్రీయంబుగ హరింపవచ్చును. కఠినసంజ్వర ధుర్యకాకోలగుళికలుగ్రమింగవచ్చును. నానా జగజ్జాలనాళనప్రక్రియోపరల మృత్యువుకోనైనను బె

వదచ్చును. యముడో ప్రశాంతదివ్యచ్ఛందంబునైనను నిలువ వచ్చును. కాని సాధ్వీమణుల కాగ్రహము గలిగించి తదీయకోప వాక్యాగ్ని జ్వాలలందు బడకుండ నెవ్వరును దప్పించుకొనజాలరు.

విష్ణు—(తనలో) ఈమె నాకు శాపమిచ్చునా యేమి?

మ విరిబోడీ! యిటు లాగ్రహింప నగునే ♦ బృందారకుల్ వేడ:నీ కరణిం జేసితి వారికి హితముగా ♦ గఁ దీనిచే నీమనో హరుఁ డీల్గెన్ విను మెందునొక్కనికి గీ ♦ డైనన్ లభించగ మఱొ క్కరికిన్ మేలిది నీవెఱుంగవొకొ యో ♦ కంబందు నీమార్గముల్.

బృంద—ముకుందా? అవ్యక్తవాక్యంబులచే నేల సమర్థింపఁజూచెదవు నాకుఁ బతివియోగముం గూర్చి దుఃఖ మొదవించినందులకు నీవు దీనికిఁ దగినఫల మనుభవించక పోవుదువా? ధర్మముదప్పిచరించిన పిదప నీవు భగవంతుఁడనైననేమి? మఱెవ్వరైననేమి! ధర్మసంరక్షణార్థమై మానవతులను భంగ మొనరింప దలచుట యా నీగుణము! సాధ్వీమణుల కాగ్రహ మొదవెనేని, వారించుట కెవ్వరుజాలుదురు నిశ్చయమైనసాధ్వి కాగ్రహం బొదవెనేనియొక్కపెట్టునసమస్తజగ త్ప్రళయము సంభవించునట్లు జేయగలుగునని తలంపుము నీవొనర్చిన యీకార్యము నాహృదయమును దహించు చేయుచున్నది కానిమ్ము ఇందులకుఁ బ్రతిఫలముగా నీవు పాషాణంబవై యుందుము

విష్ణు—హా! హతోస్మి (రాయిగా మారును)

బృంద—(దేవతల నుద్దేశించి) ఓ యింద్రాదిదేవతలారా! రణమున మదీయనాధుని గెలువఁజాలక యిట్టికపటము పన్నికలుషంబాగ్జిం పఁదలచి శ్రీహరిని నాకడకు బంపిన దుష్టచిత్తులగు మిమ్ము నీరుగ జేసినను నాకోపము చల్లారదు. మాధవుని నొకవేషధారిగఁ జేసి యీవంచననాటకము బ్రదర్శించ సాహసించితిరి.

(ఇంద్రుఁడు బ్రహ్మాదులో ప్రవేశించును)

ఇంద్రు—(బృందను గాంచి) సాధ్వీమణీ! మన్నింపుము దేవతల యెడల నిట్టిసాహసమును నేయవలదు

జారుడవై దురంతమగు శాపమునంది సహస్రయోనివరం
భారము మేనిపైఁ గనిన • పాపరతుండవు నీవు గావొకో.

మ. కకుబంతాధిప దివ్యరత్నమకుటా • గ్రస్థాపనీ భూత భీ
తికరోద్దీపిత శాసనుఁడవు మహో • ధీరుఁడవై యుండి జం
కక శాపంబున కింతసేసి గమలా • కాంతున్ వనంజేరి వం
చనమున్ జేయుమటంచుఁ బంపితివి; దు • ష్టాత్ముండవీ వారయన్.

ఇంద్రు—(తనలో) నే నేమి యుఁజెప్పక పూర్వమే యీామె నన్ను నిందించుచున్నది ఇంతటితో నూరుకొనునో లేక, నన్నుగూడ శాపతప్తునిఁ జేయునో.

బ్రహ్మ—(బృందనుజూచి) సాధ్వీమణీ! ఆగ్రహింపక నా పలుకు లాలింపుము. నీకు దెలియని ధర్మమెందును లేదు. పుండరీకాక్షు డిట్టి కార్యమును తాపసజనసంతాప నివారణార్థమై చేసె నను సంగతి నీ వెఱుంగవు. నిరంతరమును మాధవుని చిత్త మున సేవించు నీవే యద్దేవాదిదేవుని నీలీల గవింపనగునా? అతఁడు లేకున్న జగముల గతి యేమగు?

బృంద—దేవా! భారతీరమణా! అధర్మోద్యోగమున బ్రవేశించి నా భర్తృమృతికి గారణమై నాకు వైధవ్య మొదవించినపుడు నా కీ జగములతో నేమి పనియున్నది ఎవరు త్రిప్పుకొన్న గోతిలో వారేపడుదురు నాధ్వీనగు వంచింప దలంచి మధుసూదనుం డట్లు శాపము నందె దీని కెవ్వరేమి సేయుదురు.

(లక్ష్మీదేవి—ప్రవేశము)

లక్ష్మి—తనలో) బృందకడకు వచ్చు నాధుని నిట్టి కార్యము సేయ వలదని యెంతజెప్పినను వినక వచ్చి తుదకు సాధ్వీమణియగు నామె శాపంబునకు బాలయ్యెను. అక్కటా! ఇప్పుడు నే నేమి సేయుదు! (పరకించి) బ్రహ్మేంద్రాదులుగూడ భయమందియామెతో

సంభాషింపజాలక యున్నవిధము తోచుచున్నది. ఇఁక నే నీ యామెను వేడుకొందుగాక, (బృందనునవలోకించును.)

బృంద—దేవీ! పద్మాలయా! భగవంతుని యెడల నేను మహాపరాధ మొనర్చితిని నన్ను మన్నింపవలయును.

లక్ష్మి—బృందా! నీవు సాధ్వివి. సాధ్వీలోకతిరస్కారమువలన నా నాథుఁ డట్లయ్యెను! జరిగినదానింగూర్చి తలంపక, నా యందు గరుణాంతరంగవై పతిభిక్ష బెట్టుము. శ్రీహరి లేనివైకుంఠంబున నే నెట్లుందును! అది యట్లుండ సకలజగంబులును సంతాపసాగరంబున మునుంగును.

బృంద—అమ్మా

చ. వనజభవాది దేవగణ ♦ వందితుఁడీ హరియాటఁ దత్పదా
ర్చనమునకంటె నెందు నిత ♦ రంబగు కృత్య మదీప్సితోపసా
ధనమది లేదు నిక్క మిది ♦ తల్లి! సమస్త మెఱింగియుండియున్
వనజదళాక్షు నీగతి నొ ♦ నర్చితి జేర్చితి నీకు దుఃఖమున్.

జననీ! నామూలమున నీకుఁగాని జగములకుగాని సంతాప మొదవనేల? నాభర్తశరీరముతో నగ్నింబ్రవేశించెదగాక! అంతట నీ ప్రాణేశ్వరుండు నిజరూపముధరించును. (బ్రహ్మాదులనుజూచి) పితామహామహేంద్రులార! నే ననలప్రవేశ మొనర్చుటకు దగిన యత్నము గావింపుడు.

(బ్రహ్మాదులు - నిష్క్రమింతురు)

బృంద—(లక్ష్మీదేవిఁ జూచి) జననీ! నాకనుజ్ఞనొసఁగుము. సాధ్వీమణులకు భర్తయే దైవము కావున నేను పతిమార్గము ననుసరించుచుంటిని.

లక్ష్మి—సాధ్వీ! సాధ్వులమని గర్వించు నారీమణులను దలయెత్తకుండ జేసి, నన్నును నగజాత భారతినిగూడ మించిన నీ పవిత్రచరి

త్రము, మహోన్నతమహిమయు ననమానము. అమ్మా! సాధ్వీ! పతిభక్తి మించిన పుణ్యము కంటెఁ బ్రపంచమున మరియొండులేదు. సాధ్వీ ప్రభావమునకు సాటియైనదిలేదు. తల్లీ! నీ చరిత్రము నారీమణుల కెల్లరకును నాదర్శకము గాక!

బృంద:—(పాషాణమైయున్న విష్ణుమూర్తింగాంచి కరములు మోడ్చి)

సీ. అఖిలజగన్ని ◆ యామకుండవయిన,
మాధవా! నీదివ్య ◆ మహిమలెన్న
భారతీపతికైన ◆ వశముగా, దట్టిచో,
నజ్ఞానురాలనే ◆ ననఁగ నెంత
ప్రాణుల వేడ్కతోఁ ◆ బాత్రలుగాఁ జేసి,
జగమను రంగదే ◆ శంబునందు
నాటలాడించుచు ◆ నలరు మహానుభా
వుడవైన నిన్ను నం ◆ పూర్ణకోప,
మున నట్లు శిలగఁ గ ◆ మ్మని పల్కినంతనె;
బృంద సాధ్వియనెడి ◆ పేరుఁ జగతి
నిలుపంగఁ గాబోలు ◆ శిలరూపు నీవిధి
గరిమఁ గైకొంటివి ◆ గాక యున్న
లోకేశ్వరుఁడవైన ◆ నీకు నే శాపంబు?
సోఁకఁగు నేమి - యగి నీ ◆ వొందు టేమి

తే. గీ. ఏ నసలమును జొచ్చెద ◆ నీవు తొంటి
దివ్యరూపంబు ధరియించి ◆ తేజరిలుచు
నఖిలజగముల నేలుచు ◆ నలరు మింక
నాథుజనరక్ష! శ్రీవత్స ◆ జలరుహాక్ష!

లక్ష్మి—అహా! ఈమెచరిత్రము సర్వజగద్వినుతికి పాత్రమైనది. (ఎదుటజూచి) అదిగో! బృందనాథునిశిరం బగ్నిం బడవైచి తాను గూడనందు బ్రవేశించినది.

శిల—(విష్ణురూపముగా మారును.)

## షష్ఠాంకము.

విష్ణు—బృందా! బృందా!

లక్ష్మి—ప్రాణేశ్వరా! ఏమిది?

విష్ణు—బృంద యెక్కడ? బృంద యెక్కడ?

లక్ష్మి—అదిగో! శ్మశానమునకరిగిన నాథునితో నగ్నిం బ్రవేశించినది

విష్ణు—(ఎదుట జూచి) హా! బృందా! బృందా!

(నిష్క్రమించును)

లక్ష్మి—అకటా! బృందపై నీ మహానుభావునకీ వగతాపమేమి! నేనరిగి, నెమ్మదిగా నాథుని వైకుంఠమునకు దోడ్కొని పోయెదగాక!

(నిష్క్రమించును)

ఇది పంచమాంకము.





# సతీ తులసి.

## షష్ఠాంకము.

(కైలాసమున సతీదేవియు, ఇంద్రుఁడు, బ్రహ్మయుఁ బ్రవేశము)

సతి—(బ్రహ్మాదులనుజూచి) బ్రహ్మేంద్రులారా !

శా. ప్రాతఃకాలనితాంతధూసరశశి ♦ ప్రాయంబులై మీముఖ
జాతంబుల్ కళజాతియున్న గతి గ ♦ న్పట్టెన్ ననుంజూడ నీ
భాతిన్ రాఁబనియేమి? యంతటిమహా ♦ వైక్లబ్యసంప్రాప్తి హే
తింగల్గెను మీకుదెల్పుడు ధృతి ♦ క్షీణచిత్తముల్ బూనుచున్.

ఇంద్రుడు—జగజ్జనని వగు నీకు దెలియని విషయమున్నదా? పరమే
శ్వరునిచే ఖండింపఁబడిన జలంధరుని శిరముతో సాధ్వియగు
బృంద యగ్నిం బ్రవేశించినంతనే నాఁడు శాపమునఁ బాషాణమైన
శ్రీహరి నిజరూపమును బొంది బృందకై పరితపించుచు శ్మశాన
మున విహరించుచున్నాఁడు.

బ్రహ్మ—దేవీ! శతకోటిదివకర ప్రతికోటిదురవలోకోత్తేజ తేజస్సమా
ర్జితంబును, చంద్రసూర్య తారాసంకటకర ప్రాసాదసౌధహర్మ్య
వ్రజంబును, సకల దిగ్రచిత గేహవ్యూహనిర్వ్యూహమణిఘృణికాళి
తాంబరతలంబును, శోకమోహక్షుత్పిపాసాజరామృత్యువర్జిత ప్రాణి
గణంబును, నగువైకుంఠమున శ్రీహరి లేకపోవుటంజేసి కడుఁజిన్నఁ
దఱిగినది. ఇందిరాదేవి సంతాప చిత్తయై యున్నది. కావునఁ
గరుణఁబూని పద్మాలయామనోహరుఁడు వైకుంఠమును ప్రవేశించు
మార్గము సరసి, లోకసంతాపమును బాపుము.

# షష్ఠాంకము.

సతి — తే॥ గీ॥ అఖిలదేవాది దేవుండై యలరు నాదు
దౌర్భాగ్యవిదగ్ధై తాపంబు నొందుచుండు
యమ్మహాత్ముని మహిమంబు నరయగాను
నేరికైనను శక్యమే యెంచిచూడ

బ్రహ్మేంద్రులారా, నేనొకవిధముగ బీజమునొసంగెదను. ఇట్లే మీరు లక్ష్మీ సరస్వతులయొద్ద కూడ గ్రహించి భగవంతుఁడగు శ్రీహరియున్న బృంద శ్మశానవాటికయందు నాటుఁడు. దానవలన గ్రహింపబడిఁ మీచే నాటబడు బీజము బృందప్రీతిరూపమై తులసి యనుపేర బరగి విష్ణుని మోహ పరితాపము బోగొట్టును.

ఇంద్రు — మహాప్రసాదము

పార్వ — ఇదిగో! (బీజమునిచ్చును.)

ఇంద్రు — అంబా! ఇట్లే లక్ష్మీసరస్వతులవలనగూడఁ గ్రహించెదము

బ్రహ్మ — దాక్షాయణీ! ఇఁక మేము పోయివచ్చెదము

[ తెర వ్రాలును ]

రంగము (2) (శ్మశానభూమి! — ప్రవేశము - విష్ణుమూర్తి —)

విష్ణు — (ఇటునటుఁ జూచుచు;) ఆహా! శుష్కపలాశశాగణితకంకక్రోష్ట గృధ్రాభిఘటితధ్వానంబును, సత్కరీకృతశిరోజాత ప్రతాపంబును దుర్గంధనిదానంబును, నగునీశ్మశానంబెంత భయంకరముగనున్నది. ఇందు విహరించుట కా పార్వతీనాథునకే తగియున్నది. (బృంద నుద్దేశించి) హా! బృందా! నీపై మోహము నన్నెంతకు దెచ్చినది. శతసహస్రహస్కరోజ్వలమై విద్యుల్లతి కావదాతవివిధోద్యద్వైజయంతీయుతమై, వేధః, కంధరద్విషప్రముఖ దేవాగ్రేసరోపాసితంబై యొప్పు వైకుంఠమున నుండు నేను నీపై బరితాపమువనిట్లు భూత ప్రేతపిశాచ ఢాకినీగణంబులకు విహారభూమి యగు నీ ప్రేతభూమి యందుఁ జరించుచుంటినిగదా!

తే. పుటోడి. శరత్కాల • పూర్ణశశికి
వికలంబెట్టు నీముఖ • పద్మమటుల
సకల యుగ్మిలోవెల్గుట • కాత్మమొట్లు
సమ్మతించెనుతోచదు • సారసాక్షి.

చ- లలితమృణాలపల్లవ విలాసము మించెడు బాహువల్లి యు
జ్వల దనలంబువో నిడఁగ • స్వాంతము సమ్మతిబూనె నెట్లు హా
జలజముఖీమణీ! భువన • జాలము లన్నియు వేడ్కఁగుక్షిలో
పల నిడుకొన్న నాకె బలు • వంత ఘటింపఁగజాలునెంతయున్

తే. గీ. నేల నొక్కింత నడచిన • నెలత యరుణ
కాంతివహియించు భవదీయ • చరణకమల
యుగ్మ మగ్నితోఁ గాలుచు • నుండఁజూచి
యోర్చియుంటిని దుఃఖంబుఁ • జేర్చిమదిని.

సాధ్వివైన నీయశశ్చంద్రికలు చతుర్దశభువనములయందును గాయ
జేసికొంటివి నాచిత్తమున సంతాపము నాటితివి.

(బ్రహ్మయు-నిందుద్రుడు-ప్రవేశింతురు.)

ఇంద్రు—(బ్రహ్మను జూచి) దేవా! భారతీరమణా! శ్రీహరి స్థితి
యేరీతిని నున్నదో చూచితివా:

బ్రహ్మ—ఈమహాత్మునిదర్శించి సంభాషింతముగాక (విష్ణుమూర్తిఁ
సమీపించి)

సీ. అలవైకుంఠనగరి నలరు చుండెడు నీవు
ప్రేతభూమిని విహ • రించుటేమి
సన్మునుల్ భజియింప • సంతసించెడు నీవు
భూత భజనచేత • బొలుచుటేమి
ఫణిరాజశయ్యపైఁ • బవ్వళించెడు నీవు
వల్లకాటిని నిల్లు • బండుటేమి

భక్తుల దుఃఖంబు ♦ బాపుచుండెడు నీవు
భూరి దుఃఖాబ్ధిలో ♦ మునుగుటేమి

తే. గీ. జలజవాసిని రాణియై ♦ యలరుచుండ
బృందకై పరితాపంబు ♦ బొందు టేమి
రమ్ము వేగ వైకుంఠపు ♦ రమ్ము జేర
కమలదళనేత్ర! నన్నును ♦ గన్నతండ్రి.

ఇంద్రుడు—

సీ. జలజాలయాదేవి ♦ సతి పద్మజుఁడు పట్టి
భారతికోడ; లీ ♦ శ్వరుఁడు హితుడు
ఫణిభోజనుఁడు తేజి ♦ ఫణిరాజు తల్పంబు
వందిజనములు తా ♦ పసగణంబు
కామోదకీనంద ♦ కసుదర్శనంబులా,
యుధములు ఘనశంఖ ♦ మొత్తుబూర
యమర సంతతిసేవ ♦ కావలి నేత్రిముల్
సోమభాస్కరులు; కౌ - స్తుభము భూష

తే. గీ. అం; బజాండంబు మేను; సం ♦ ద్రంబు గృహము
భక్తచిత్తంబులు విహార ♦ వనము; లిట్లు
వెలుఁగుచుండిన నీవొక్క ♦ కలికి కొఱకు
దావముందుట మిగుల చో ♦ ద్యంబు గాదె.

దేవా! నీకై రమాదేవి మిగుల వెంగఁగొని నీవులేకుంటచే వైకుంఠంబుఁ బ్రవేశింపకయున్నది. సత్వరముగా విచ్చేసి మాకందఱకును ముదంబుఁ గొల్పుము.

బ్రహ్మ—తండ్రి బృందకై యింకఁ బరితాపము విడువుము నీపరితాపమును బాపుటకు మేము సతీదేవివలన నొక్క బీజమును గ్రహించి యీప్రదేశమున నాటితిమి అయ్యది బృందప్రతిరూపమౌ తులసియనఁ బఱగె దానిం జూడుము

విష్ణు—బృంద ప్రతిరూపము ? ఏది ! ఏది ?

(తెర లేచును)

(తులసి భూజముండును)

బ్రహ్మ—దేవా ! వీక్షింపుము

విష్ణు—(సంతోషముతో) ఆహా ! ఏమి ? (బృంద నుద్దేశించి) హా ! బృందా !

తే॥ గీ॥ పడఁతి ! నాదు సంతాపంబు ♦ బాప నిట్టి
మాడ్కి నతి కృపఁ దులసిగా ♦ మాఱినావు
భళిర ! నాకును బ్రియమైన ♦ వస్తువగుట
నీవు మునిజనామరులచే ♦ నిఖల జగము
లందు పూజలన్ గాంతు నా ♦ నంద మెసఁగ.

సీ. దినకరోదయమునఁ ♦ గనిసంతసే కదుఁ
రాణించు పద్మాక ♦ రంబుపగిది
సంపూర్ణ పూర్ణిమా ♦ చంద్రురాకనుగాంచి,
రంజిల్లు రత్నాక ♦ రంబు మాడ్కి
వాసంతలక్ష్మి వి ♦ లా సోదయంబున
వికసించు నుద్యాన ♦ వీధిభాతి
వార్ధరు రాకకు ♦ పరమ సంతోషంబు
నొందుచు నుండు మ ♦ యూరమట్లు
తే. గీ. నీమహోదయంబున నాకు ♦ నిక్కముగను
బరమహర్షంబు గలిగె దా ♦ పంబు వాసె
నఖిల జగములఁ బూజల ♦ నందుచుండి
తులసి యనుపేర నొప్పుచుఁ ♦ జెలఁగుమింక

బ్రహ్మేంద్రులారా ! ఈతులసీమహోదయమున నేను స్వస్థచిత్తుండ నైతిని. ఇంక నేను వైకుంఠమున ప్రవేశించెదను కాన

మీరు మాత్ర మొక కార్యము సేయవలయును. ఈ తులసిని బృందా
వనమునఁ బ్రతిష్ఠింపుడు.

ఇంద్రు—ఆజ్ఞ నెరవేర్చెదము.

బ్రహ్మ—మహేంద్రా ! భగవంతుడగు శ్రీహరి స్వస్థచిత్తుడయినాడు
ఇంక మనకు గావలసినదేమున్నది.

ఇంద్రు—

సీ॥ జలజాక్షి యా బృంద ♦ సాధ్వీత్వమతివల,
కాదర్శంబౌచు ♦ నలరుగాక
హరికిఁ బ్రీతియగుచు ♦ నలగు తులసి సమ
స్త గృహాంబులందునఁ ♦ దనరుగాక
శ్రీనాథు ప్రీతికై ♦ చిరభక్తి తులసిని
జేరి యందఱును బూ ♦ జింత్రుగాక
పూసి నర్చించి, ని ♦ స్తుల సౌఖ్యభోగసం
పదలు మానవులు గాం ♦ చెదరుగాక

తే. గీ. తులసి యందు పరిదేశమం ♦ దు హరిగూడ
యుండి భక్తజనుల బ్రోచు ♦ చుండుగాక
పరమ పావనంబుగ నెంచ ♦ బడెడు తులసి
దళము ప్రతివారు శిరముల ♦ దాల్త్రుగాక.

బ్రహ్మ—తథాస్తు (తెరవ్రాలును.)

ఇది షష్ఠాంకము.

సర్వము సంపూర్ణము.

———

# ఆంధ్రనాటకములు.

| | రు. | అ |
|---|---|---|
| కనక్తారా నాటకము చం॥శే | 1 | 4 |
| కృష్ణలీల బళ్ళారి పం॥ను॥ | 1 | 8 |
| లవకుశ బళ్లారి డిటో | 1 | 8 |
| కన్యాశుల్కము సు॥అ॥ | 1 | |
| రోషనారా కొ॥కు | 1 | 4 |
| తులసీదేవి ము॥చె | 1 | |
| బొబ్బిలియుద్ధము శ్రీ॥కృ॥ | 1 | 0 |
| రసపుత్రవిజయము ఇ॥యు॥ | 1 | 0 |
| రాణాప్రతాప్ శింగ్ డిటో | 1 | 0 |
| భక్త రామదాసు కే॥శి | 1 | 0 |
| రామదాసు బళ్ళారి డిటో॥ | 1 | 0 |
| రామదాసు రా॥ నా॥ | 1 | 0 |
| చింతామణి కొ॥ నా॥ | 1 | 0 |
| చింతామణి చ॥ మా॥ | 1 | 0 |
| చింతామణి రా॥ నాం | 1 | 0 |
| వైరాగ్య చింతామణి బ॥ కొ॥ | 1 | 0 |
| కంఠాభరణము పా॥ ల॥ | 1 | 0 |
| రాధాకృష్ణ డిటో | 1 | 0 |
| సావిత్రి మైలవరం వారిది ప్రదర్శించేది శ్రీ॥ స॥ | 1 | 2 |
| సత్యహరిశ్చంద్రీయం బ॥ ల॥ | 1 | 5 |
| బుద్ధిమతీవిలాసము డిటో | 1 | 0 |
| ఉత్తరరాఘవము డిటో | 1 | 4 |
| సాత్రాజితీయము | 0 | 14 |
| మహానంద ల॥ కో॥ | 1 | 6 |
| జయంతజయపాలము | 0 | 12 |
| వేణీసంహారము వ॥ సు॥ | 1 | 0 |
| శకుంతల కం॥ వీ॥ | 1 | 0 |
| శకుంతల వ॥ సు॥ | 1 | 2 |
| ఆలీబాబాకొత్త నాటకం పో॥రా॥ | 0 | 12 |
| శ్రీరామ పట్టాభిషేకము | 1 | 0 |

| | రు | అ |
|---|---|---|
| గయోపాఖ్యానము చి॥ ల॥ | 0 | 8 |
| ప్రసన్నయాదవము డిటో | 0 | 8 |
| పారిజాతాపహరణము | 0 | 8 |
| చతురచంద్రహాస డిటో | 0 | 8 |
| పార్వతీపరిణయము డిటో | 0 | 6 |
| స్వప్నవాసవదత్త డిటో | 0 | 6 |
| పాండవజననము రా॥ రా॥ | 0 | 10 |
| పాండవప్రవాసము డిటో | 0 | 12 |
| పాండవోద్యోగము డిటో | 0 | 12 |
| పాండవ విజయము డిటో | 0 | 12 |
| పాండవాశ్వమేధము డిటో | 0 | 12 |
| అహల్యా శాపవిమోచనము | 0 | 12 |
| ద్రౌపదీవస్త్రాపహరణము | 1 | 0 |
| సంపూర్ణ రామాయణము గు॥కో॥ | 1 | 4 |
| సంపూర్ణరామాయణము కొ॥క॥ | 1 | 4 |
| సంపూర్ణ భారతము పి॥క॥ | 1 | 4 |
| మహాభారతము సం॥శి॥ | 1 | 4 |
| సంగీతకృష్ణలీల డిటో | 1 | 0 |
| అర్జునప్రతిజ్ఞ ప్ర॥వె॥ | 0 | 12 |
| భీష్మప్రతిజ్ఞ క॥కో॥ | 0 | 12 |
| భీమప్రతిజ్ఞ క॥కో॥ | 0 | 12 |
| మోహినిరుక్మాంగద డిటో | 0 | 13 |
| రాణీసంయుక్త | 0 | 8 |
| లంకాదహనము | 0 | 10 |
| వేశ్యాహితబోధిని డిటో | 1 | 0 |
| వేశ్యామధురం పా I | 1 | 0 |
| డిటో పా II | 0 | 12 |
| డిటో పా III | 0 | 9 |
| సురాపుద్దౌలా జ॥ల॥ | 0 | 8 |
| భక్తకబీర్ కొ॥ | 1 | 0 |
| పాదుకాపట్టాభిషేకము ద్రో॥శీ॥ | 0 | 12 |